# నక్షత్రమాలిక.

**1939**


గ్రంథకర్త,

వి. యస్. వెంకటనారాయణ,

బి. ఏ. ( ఆనర్సు )



స్వతంత్ర ముద్రాక్షరశాల, నెల్లూరు.


మూల్యం : **0—4—0**

# నక్షత్రమాలిక.



వి. యస్. వెంకటనారాయణ,

బి. ఏ. (ఆనర్సు)

సర్వహక్కులూ మావి] [మూల్యం : 0-4-0.

# అంకితము

నన్ను అదుపులో ఉంచి తీర్చిదిద్ది
నా శ్రేయానికీ అభివృద్ధికీ
కారణభూతులై వఱలి

నన్ను అపారశోకసాగరంలో
ముంచిపోయిన
మామామగారు

## కీ. శే. అల్లాడి రామబ్రహ్మం పంతులుగారికి

భక్తిపూర్వకంగా అంకితం చేయబడింది.

---

# పీ ఠి క.

స్థానిక పత్రికల్లో నాచేరచింపబడి ప్రకటింపబడిన కొన్ని కథలున్నూ ఈ పుస్తకరూపాన్ని పొందినవి. ఇందులో ఏపాటి దోషాలున్నా సహృదయులై విమర్శకులు మన్నింతురుగాక. ముద్రణ విషయంలో సహాయంచేసిన 'స్వతంత్ర' పత్రికాధిపులు శ్రీ వెన్నెలకంటి ఆంజనేయులుగారికిని ఫోటో బ్లాకును తెప్పించి పలువిధాలా తోడ్పడిన 'సింహపురి' పత్రికాధిపులు శ్రీ పాటూరు సుబ్బరామయ్యగారికిని నేనెంతో కృతజ్ఞుణ్ణి.

నారాయణ విలాస్,
సుబేదారుపేట, నెల్లూరు.

వెంకటనారాయణ,
27—3—1939

# విషయసూచిక.

# మా అమ్మాయి చదువు.



౧

అపుడే క్లైయింటనుపంపి ఇంటిలోపలికొచ్చాను. చూచా నుకదా- మాఅమ్మాయి సరళ ఒక కట్ట పుస్తకాలని పట్టుకొంటూ స్కూలుకు పోబోతూఉండినది. ప్రసవంచేయడానికి వెళ్లే నర్సులైనా అన్ని సామగ్రులు పట్టుకెళ్ళరుమఱి. ఓవాగిణాబరువు ఉండినది. 'ఏమే! సరళా! ఎందుకంతబరువు మోస్తున్నావ్!' అంటూ ఆమెను ప్రశ్నించాను.

ఏమీలేదునాన్నా! అవన్నీ కావాలిమఱి!

అన్ని డ్రాయింగుబుక్కులూ మ్యాప్ డ్రాయింగులూ ఇవన్నీ ఎందుకూ?

కాదునాన్నా! లెక్కలటెక్స్టు, టెస్టునోటుబుక్కు, నోటు బుక్కు, జామిట్రీ డ్రాయింగ్‌బుక్ మఱి యిలాగే అన్ని వబ్జక్టుల కున్నా.

అయితే టెస్టు నోటుబుక్కు ప్రతిదినమూ తీసుకో పోవాలనా?

అదికాదు నాన్నా! మాకు ఎప్పుడంటేఅప్పుడు ఐదు

మినిట్సు టెస్టు, ఆఱుమినిట్సు టెస్టు వర్డుటెస్టు, అంటూ పలు విధాలా పెడుతూవుంటారు. అన్నీకూడాను ఆటెస్టు నోటుబుక్కుల్లోనే వ్రాయాలి. లేకపోతే మార్కులలో మినహాయింపు లవుతాయ్!

(ఇంతలోగా లోపలనుంచి కేక వినబడింది.)

అది మాయిల్లాలి సింహనాదం. 'స్కూలుకు పోయే దాన్ని పోనివ్వకుండా ఏంటి మీదిక్కుమాలిన ప్లీడర్ప్రశ్నలున్నూ మీరున్నూ?'

మతేముంది. జాస్తిగా మాట్లాడనుండాను సరళతో అన్నాను. 'సాయంత్రం త్వరగా వస్తావుకదా! షికారుకు వెళ్ళే టప్పుడు మాట్లాడుకొందాంలేమ్మా!' సరళ స్కూలుకు వెళ్ళింది.

౨

మాకు కొంత భూవసతిఉంది. ఉద్యోగం పురుషలక్షణం అవడంచేత డబ్బు వచ్చినా రాకపోయినా డాబుగా ఉండడానికి ప్లీడరీ అని అనుకొని ప్లీడరీ చదివి ప్రాక్టీసు చేస్తూవున్నాము. హాయిగా కాలుమీద కాలువేసుకొని పిత్రార్జితాన్ని సాపాటు చేస్తూ కేసులువున్నా లేకపోయినా గుమాస్తా నెత్తిపై ఓదస్త్రం పెట్టి దాంట్లో కేసుఫైలులకు బదులు కోడ్ పుస్తకాలతోనింపి మ్యాజిస్ట్రేటుకు రెఫరెన్సుకుఇస్తూ 'యస్ యువర్ ఆనర్! ఐహావ్ ఇట్!' అంటూ, 'తైర్' వ్రాయడం అలవాటయింది. ఇలా చెప్పడానికి సిగ్గులేదా అంటారేమో! కాలవ్యవస్థ ఆలాంటిది మగ

వాడికి సిగ్గుతో పనిలేదు. ఉన్నమాటను చెప్పాముకాని లేనిదాన్ని చెప్పలేదుకదా. అలాఅని " కలియుగ సత్యహరిశ్చంద్రుడురా!. అంటూ" మమ్మ దెప్పవలసిన అవసరంలేదు. ఏదో శాస్త్రో కూస్తో ఉన్నదానితో తృప్తిచెంది జీవనం భుక్తిముక్తులతో గడిపితే చాలునని మా అభిప్రాయం. కాబట్టి సమాచారం చెబితే యేమీ నష్టంలేదు.

కోర్టునుండి ఆదినం సాయంత్రం త్వరగానేవచ్చి కాఫీ పుచ్చుకొని ఈజీఛేర్‌లో నడ్డివాల్చాను. సాయంత్రం ౫ వయింది అప్పటికీ మాసరళ స్కూలునుండి రాలేదు. ఇదేంటట్టా ఇంతసేపయినా రాలేదు అంటూ ఆలోచిస్తూఉండినాను. ఇంతలోగా సరళ స్కూలునుండి వచ్చింది. చూచానుకదా మొహము కళావిహీనమైఉంది. వచ్చీరావడంతోనే బరువుని మూలలో పడవేసి పెఱటికి వెళ్ళింది. ఏమో అయివుంటుందని మేము అనుకొని 'ఏమమ్మా' అంటూ హెచ్చరించాను. మొహం కడుక్కొని అంతా సర్దుకొని దగ్గఱకువచ్చి బైటాయించింది.

ఏంలేదునాన్నా! ఈ మిషనరీస్కూలులో నేను చదువను అంటే మానేరుకాదు. అవస్థపడుతున్నాను!

సమాచారంఏంటో చెబితేగా! పరిష్కరించడానికైనా?

ఆటీచర్లు ఏమీఅనరునాన్నా! వాళ్ళకి పాఠాలుతప్ప అన్నీ వచ్చుమఱి. అక్కడ మన అయ్యవార్లు ఉన్నారే! వాళ్లు నానా అన్యాయంచేస్తారు.

సమాచారం చెబుదూ! తీరుస్తున్నాను!

నేను మీరుచెప్పిన కాంపోజిషన్ వ్రాసుకొని పోయాను నాన్నా! నాదిచూచి సుబ్బు కాపీచేసి వ్రాసింది. ఆమెకుమాత్రం 4 మార్కులిచ్చి నాకు 1/2 మార్కుయిస్తే ఏలాగ?

అయితే కాపీ చేయడం తప్పుకాదటే?

కాదు నాన్నా! మఱి తెలియనివాళ్ళకి చెబితే ఏంనష్టం? అలాగే ఇద్దరూవ్రాస్తే ఇద్దరికీ సరిగ్గాఇవ్వాలి. మఱి కాపీ అని ఎందుకు అనుకోవాలి. క్లాసులో అందరూ అలాగేవ్రాస్తే వాళ్ళ కందరికీ మార్కులిచ్చి మా కెందుకు ఇలాచెయ్యాలి?

సరేలే. మఱి ఆ లెక్కచేసిందా!

లేదు నాన్నా, ఆ లెక్కచూపిస్తే బస్సుమనిలేచింది. ప్రతి లెక్క నేనువేస్తానా! చేతనైతే వేసుకోలేకపోతే ఎవరినైనా వేసినవాళ్ళని అడిగివేసుకో అని కస్సుమన్నది. లేదుటీచర్! ఎవ కీరాలేదు అంటే పరీక్షకి అదే ఇస్తాను. చూస్తాం అని చెప్పింది.

అంతేకదా పోనీలే. ఇంకేమయినా ఉన్నాయా ఈ దినానికి.

నీవుచెప్పిన జవాబుకు అయుదుకి అర్ధమార్కువచ్చింది.

మాకు శృంగభంగమయింది.

మఱేం, మా స్కూలుపటాన్ని గీయాలట. దేశపటంలో ప్రత్తి, జనుప, మొదలయినవన్నీ పండే ప్రదేశాలదగ్గఱ ఆ వస్తు వ్వన్నీ అతికించమని చెప్పింది నాన్నా! ఎక్కడనుండితేను దీన్ని!

నేను కంప్లయింటు వ్రాస్తాగా, దాన్ని తీసుకెళ్ళు.

ఇంతలోగా మా ఆవిడ పొరుగింటినుండి వచ్చింది.

ఏమండీ! విజయాబాయమ్మ ఇంటికి పసుపు కుంకుమకి వెళ్ళిరావాలి. ఇంట్లో ఉంటారుకదూ.

మరి ఉండనంటే బ్రతుకనిస్తావా! కానీ అలాగే!

సరళా! నీవుకూడా రావే పోదాం.

కాదమ్మా! నేను చాలాచదువుకోవాలి.

ఏంసింగినాదమే! నీచదువూనీవూను. ఆయనతో మాట్లాడ్డానికి టైండుండదేం అంటూ సరళపై ఉరిమింది ఎలాగైతేనేం ఇద్దరూ తర్లివెళ్ళారు. చాలాసేపుచూచాము. ఏమిరాబ్బా! ఈ తాంబూలం పోవడం ఏంన్యూసెన్సు! పోయినచోట్లో లోకాభిరామాయణం! పికారుకువెళ్ళాలి. కాదని చెప్పేమా, ఎప్పుడూ యింతే అంటూ ఇల్లాలు రాగాలెడుతుంది అబ్బ! అనుకుంటూ కూర్చొనియున్నాము. ఇంతలో చేతిలో తములపాకులును. నెత్తిపై దమ్మిడీకాసంతబొట్టుతో మొగం కళకళలాడుతూండగా మా గృహిణివచ్చి నిలిచింది.

ఏమండీ! ఇంకారాలేదేం ఈపీడ! అనుకొంటూఉన్నారా. ఇక పోయిరావచ్చును.

అదేంటే! ఎప్పుడూను! నీవేదైనఅంటే నేను వద్దంటున్నానా॰ అలాఅంటే ఎలాగ?

పోసింది! మీరుమంచివాళ్ళు నేనుచెడ్డవాన్ని. ఇక దయ చెయ్యవచ్చును.

అయితే సరళా!

ఆమె ఎందుకండీ ఆమెకు టైంలేదు. చదువుకోవాలి. మగాళ్ళు మీరుతిరగడంచాలదూ!

ఇక నేనేమీ వాగ్వాదంచేయకుండా వెళ్ళాను.

3

మఱునాడు స్కూలుకువెళ్ళి సరళవచ్చిచెప్పింది. 'నాన్నా కంప్లెయింటువద్దు పాసూవద్దు - అంటే నాప్రాణాలు తీశారు కదా! మీ ఉత్తరంచూపిస్తే ఇంత చిన్నవిషయానికి అంత చేస్తారా ఎలాగో ఓలాగు బొమ్మగీయకుండాను అని నన్ను దబాయించింది.' అప్పటినుంచికూడ మానసరళకుస్కూలులో యమ యాతనగా కనుపడింది, మేమేంచేయడం. ఇక ఈపాడు స్కూళ్ళ లో చదివించడం ఎందుకు వేరేస్కూలులో చేర్పిద్దాం అని యనుకొంటూ ఆమెకు చదువు మాన్పించాము. ఇలా ఆడబిళ్ళ డిక్టేటర్ల ధాటికి ఆగలేకుండా మేము స్కూలు మాన్పిస్తే ఊళ్ళో వాళ్ళు ఏమన్నారో తెలుసునా?

"ఒరేయ్! చెల్లెలికొడుక్కి పెండ్లిచేయడానికి చూచాడు రా ఛాందసుడు! వాడు స్కూల్ఫైనల్ మజలీలు వేస్తూవుంటే ఈమెపైకివస్తేకష్టం అని పిల్లని బడిమాన్పించాడు. అని మా

యింటిప్రక్కనఉండే రామయ్యచౌదరి భీమారావుతో చెప్పాడని మా రాముడు నాతో చెప్పాడు. వీళ్లతో మనకేంచెప్పండి? నిజంయెరిగి మాట్లాడితేగా? అన్నట్లు చెప్పడానికి మఱచాను. మా సరళకు మఱునటిఏడు మా చెల్లెలి కొడుక్కుయిచ్చి పెండ్లిచేయడంచేత చదువు పూర్తిఅయింది.



# మా వాడు.

వాడితో వేగడం కష్టమయిపోయింది. పోయేవాడు అట్టే ఊరకపోకుండా, నన్ను సుందర్రామయ్యా వాడికి గార్డియన్‌గా పెట్టిపోయాడు. ఈబాధ్యత నానెత్తిపైన కూర్చొన్నది.

అలాటప్పాగా ఊరకే వాడియిష్టంవచ్చినట్లుగా వదిలెయ్యడం నాకు యిష్టంలేదు.

మంచి అదుపులో సరియైనమార్గంలో వాణ్ణి పైకితెద్దామనే నిశ్చితాభిప్రాయంతో వాడికి సుద్దులు చెబుతూఉంటాను. అయితే వాడితల్లిమరుగున ఆ ఆదరువుతో ఇలా అలా పెరిగాడు.

బాగాచదువురా నాయనా! పరీక్షలు ప్యాసయితేనే వుద్యోగాలు దొరకడంకష్టం, మజిలీలువేసుకొంటూ టాలాటోలీగా తిరిగితే ఉపయోగంలేదు. అని యెన్నోసార్లు చెప్పాను. నామాట వింటేనా?

జాస్తిగా గదమాయిద్దామా అనిచూస్తే వాళ్ళ అమ్మకి తండ్రిలేనిబిడ్డడని వాడిపైన చాలాముద్దు. లబోదిబోఅని వేసుకొంటుంది. నాయనా! నీకుభయపడి వాడు భోంచెయ్యడము కూడాలేదుసరిగా. పిల్లలవిషయంలో ఇంతకటుకుగాఉంటే ఎలా? ఆమహారాజు వుండివుంటే ఇలాచేస్తాడా! అంటూ రాగాలు పెడుతుంది.

చూద్దామాఅంటే అయ్యకు వేషాలుతప్ప మరేమీలేదు,

వాణ్ణి నేనుమందలిస్తే వాళ్ళమ్మ నన్నుమందలిస్తుంది.

ఇది తెలిసి వాడు నేనుచీవాట్లుపెట్టినప్పుడు రాయికొట్టిన బెల్లంలాగ చప్పగ వింటూఉంటాడు.

అవతల మామా, అయిందా అంతాను, తీరిందా నీనోటి తీట! అంటాడు. కఠినంగా ప్రవర్తించడానికి వీలులేదు. ఒకవేళ వాళ్ళమ్మని గణించకుండా కొట్టానా ఊళ్లోవాళ్లల్లోఅబ్బా! ఏం కరోడ్కటకుడువాడు! అధికారంవుందని చంపేస్తున్నాడురా పిల్లడిని పాపం! అంటూ నన్ను నిందిస్తారు.

తలచుకొన్నపుడల్లా నాకు సుందరరామయ్యపై బండెడు కోపం వస్తూవుంటుంది.

ఇది నాకర్మం అనుకొంటూ నోరుమూసుకొని వుందామా అంటే నోరు నిలువదాయెను.! ఏంచేయడం.

౨

ఈమధ్య వాడిలో ఒకవిధమైన పరివర్తనము కలిగింది.

నేను దేశసేవచేస్తాను. మామా! దేశభక్తి ప్రతివాడికీ ఉండవలసిందేకదా? హిందూదేశంలోవుండే ప్రతివాడి కర్తవ్యం అంతే అన్నాడు.

ఉండవలసిన కోరికయేకాని ఈసమయములో, నీకు ఇంత ఎక్కడనుండి వచ్చింది? ఏమీతెలియనివాడవు నీవేందిరా చేయగలవ్? అన్నాను.

పికెటింగ్ చేసెదను.

ఒరేయ్! ఉత్త వెర్రివెంగళప్పగా ఉన్నావే. పికెటింగ్ సామాన్యమనుకొన్నావటరా! అది ఒకగొప్పకళరా. దాంట్లో నీకు ఓపిక, దృఢనిశ్చయం ఇవన్నీ ఉండాలికదా! ఇవన్నీ నీకెప్పుడెందు కురా, బాగాచదివి అవతల చూడరా.

అదేంమామఅలాఅంటావు. ఎప్పుడు పుస్తకాలు పట్టుకొని రొప్పుతూఉండడమే రంగడిలాగా! మనిషిలో జీవంలేనిచదువు యెందుకు?

వీడికి నేనెలా బదులుచెప్పడం. నోరుమూసుకొన్నా.

అయినా ఆగిందికాదు.

ఒరేయ్! చెడిపోతావురా! జాగ్రత్తగా చదువుకోరా!

ఏంటి మామా చెడిపోవడం? చెడిపోవడం అనేది ఒకటి వుందాఏమిటి?

కొంచెంసేపు ఊరకేఉన్నా,

అయితే ఇపుడెక్కడికిరా పోతూవున్నావ్?

ఈవేళ రషియాస్వాతంత్ర్యదినం. మేమంతా దానిని Celebrate చేయబోతూవున్నాం!

ఇదేం దేశసేవోయ్! అన్యదేశసేవఅవుతుందికాని మనదేశ సేవ ఎలాఅవుతుందీ?

అంటే అదిమాఆదర్శంఅన్నమాట. రషియాస్వర్గం. అక్క డఉండేవిధంగా ఇక్కడవుండవలెనని మేము కోరుతూవున్నామ్.

అయితే నీకు రషియాను గురించి ఏం తెలుసూ?

పుస్తకాలు చదివాం. లీడర్లు చెబుతూన్నారు.

అవన్నీ బూటకాలురా! అక్కడవుండే సమాచారం నిజం బయటికి వస్తుందనుకొన్నావా?

అక్కడ ఈవిధంగా స్వాళ్ళువిడిచి మాట్లాడితే మిమ్మ లిని పుటంవేస్తారు తెలుసా!

జవాబు లేదు.

వాటినిజం నీకెలా తెలుస్తుంది. ఇక్కడ అధికారుల నిరం కుశప్రవర్తనా. అక్కడ ప్రజలతరఫున నిరంకుశప్రవర్తనం. ఇక్క డాకష్టమే. అక్కడాఅంతే. నీకు సమాచారము తెలిస్తే అప్పుడు నిజంగా అల్లేచేస్తే సరిపోతుంది!

అయితే మామా నీవుదానిపైనా, దీనిపైనావిదేశాల యుద్ధాలంటూవ్రాస్తావే అవన్నీనీవు నిజంగాచూచే వ్రాశావా?

చూచినవాళ్ళువ్రాస్తే వాటిని అందరికీ తెలియడానికి వ్రాశాను.

చూచినవాళ్ళకి దాంట్లో నిష్పాక్షికమైన అభిప్రాయం ఎలాఉంటుందీ! ఒక్కొక్క అభిప్రాయంతో వాళ్ళు వ్రాస్తావుం టారుకదా!

అది నీవు అన్వయించుకో తెలుస్తుంది.

అది నీవుమాత్రం ఎందుకు అన్వయించుకోకూడదూ?

ఇకనేను వాడితో మాట్లాడడానికి వీలులేకపోయింది.

ఒరేయ్! నీకు యివన్నీ అనుభవంలో తెలుస్తుందిరా, తొందరపడవద్దు.

'వృద్ధనారీ పతివ్రతా' నీవు అనుభవంవల్ల నేర్చుకొంటే నేనుమాత్రం అలాగే నేర్చుకోకూడదా 'Practical method చాలా వాంఛనీయమంటూ ఎన్నోసార్లు చెప్పావుకదానాకు?

ఇక ఉపయోగంలేదు ఇని వాణ్ణి అలాగే వదిలేశాను.

వీడిని ఏంచేమంటారు? అవతల వీడు చిక్కులలోబడితే నన్ను దెప్పిపొడవకుండా ఉంటారనుకుంటూ మీకు ఈవిషయం తెలుపడమైనది.



# బసవయ్య పెండ్లి



## రైలులో

లెగు! లెగు లెగవయ్యా లెగు!

ఏంటండి! ఇంతవరకునిలుచోని అన్ని అవస్థలూపడినాను. నిద్రపోవాలి. వాళ్తేరుకుపోవాలికదా! ఏలాగండీ!

అదేటండీ! బండల్లా మందీ అనుకొని ప్రియాణంచేస్తే ఏలాగ! మీకువసతులు కావాలసివుంటే, ఎలావస్తుంది. అందరి మల్లె ప్రియాణంచేయాలి కాని!

పంతులూ! మరి మీతో నేను మాటాడడం సరిలేదు. కానివ్వండి.

అంటూ రంగన్న కళ్ళు నులుముకుంటూ లేచికూర్చున్నాడు.

ప్రిక్కన్నే కొత్తగావచ్చినాయన బైటాయించాడు.

బండిలో అంతా పూర్తిగా ఆడజనం, పదిమందిఉన్నా అందరూ కాలుజాపుకొని హాయిగా తొంగునేనాళ్ళాయిని, ఏలాగండి వారిని లేపడం!

సరే వారికి ప్రత్యేకంగా ఓ పెట్టె ఉన్నాగూడా మగవారి పెట్టెల్లో కూర్చోడం సర్వసాధారణమైపోయిందిగదా!

చూచారా! మగవారెవరూ ఆడజనం పెట్టుల్లో ఎక్కరు గదా! అది కాదండీ! అన్నిటిలో ప్రత్యేక హక్కులు ప్రత్యేక ప్రాతినిధ్యాలు ఇలాంటివి కావాలంటారుకద. ఇది చూచారూ! ఇక్కడవేరుగా పెట్టుడుంటే మరి మనం మీాదికొచ్చి పడడం ఎంటి.

అందుకేం చేదాం! బాబూ! వీళ్ళతో మనంవేగలేం. స్కూళ్ళు వేరుగా వుంచినా మగవాళ్ళు స్కూళ్ళకే పోతూంటారు!

అవును ఇంతకూ మనమేం చేయగలం! నిరుద్యోగంతో మగజనాభా అంతా అల్లాడుతూంటే, వీళ్ళకీ విద్యాభ్యాసం చేయించి డిగ్రీలు ఇప్పించడంచేత వారికి గోరుచుట్టుపై రోకటి పోటయింది.

ఈ విధంగా రంగన్న వాదంచేస్తూ, పోతూఉన్నాడు. ఇంతకు ముందుండిన నిద్ర ఎక్కడకు పోయిందోగాని.

రంగన్న కొంచెం పూర్వకాలపుమనిషి. ఏబదిఏళ్ళు ఉంటాయ్. బంగినపల్లిగ్రామంలో కొద్దిభూవసతివుంది. అతనికి దాని కోసరంపోయి వుండి తిరుగా తన కుమారుడు వుద్యోగంలో వుండేచోటుకాబట్టి వాల్తేరుకు పయనంసాగిస్తున్నాడు. ఆడవాళ్ళు విద్యాభ్యాసంచేయడం మొదలయిన విషయాలు ఈయనకు గిట్టవు. అయినా తన కుమారుడు చదువుకొన్నభార్యే కావాలం

టాడు. గువ్వలాగుంటుందిరా. మీ అత్తకూతురు జానికి. ఆమె
ను చేసుకోరా అని లక్షాతొంబయిసారులు చెప్పాడు కొమారు
డికి చదువుకొన్న భార్య గుణవంతురాలుగా వుండదనే అభి
ప్రాయంతో.

ఈ లక్షా తొంబయిసార్లుకూడా వాడు నిర్గంధ కుసుమంలాంటిది అవసరంలేదు. అన్నిగ్రహించుకొని సమానముగా మనసెరిగినమనిషిని పెండ్లిచేసుకోవలసింది. చదువుకొంటే స్త్రీ గుణవంతురాలు యెందుకురాదు? చదువుకోనివాళ్ళందరూ సుగుణపుంజాలా? అని వాదనకు ఆరంభించేవాడు. అందుచేత ఆడవాళ్ళని అందులో చదువుకొన్నవాళ్ళనిచూస్తే అఱకాలిమంట నెత్తికెక్కుతుంది రంగన్నకు. ఎప్పుడుచూచినా యేదోఒక సాకు పెట్టి ఆడవాళ్ళని తిట్టిపోయడం అలవాటయింది.

బసవయ్య రంగన్నకుమారుడు. ఛాందసుడి కుమారుడైనా అధునాతన యువకుల సాంగత్యముచేత ప్రస్తుత నాగరికత వాసన అబ్బింది. తాను ఫేషన్‌కలవాడనే అందరూ యెరిగేటట్టు చరిస్తువుంటాడు. వాల్తేరులో గోధురామ్ గుడ్డలషాపులో ఓ పాతికరూపాయలు సంపాదించుకొంటున్నాడు నెలకి. తండ్రికి యిన్నిపై చాలప్రీతి. బుద్ధిమంతుడు. బి. ఏ. వరకూచదువుకొన్నా గుడ్డలషాపులో పనిచేయడానికి వెనుదీయలేదు. మరేలెండి నిరుద్యోగము దేశములో ప్రబలింది. బోధింపబడేవిద్యకూడా అఱ

కొంఱగావుంది. మాతృభాషలోనైనా అభిప్రాయాలని సరిగా తెలుపడానికి శక్తి లేకుండా అందరూ తయారైవున్నారు. కాబట్టి ఆ సిస్టంతప్ప మఱిదేనికీ ఉపయోగములేకుండా పోతున్నారు. అందరకీ ఉద్యోగాభిలాషచే విద్యాభ్యాసముపై కన్నుపోతూ వుండేకాని తనజ్ఞానాన్ని వృద్ధిపఱచుకోవలెననీ, కళాభివృద్ధి మనో వికాసము యిలాంటివి కలుగాలనీ, Platformలో జోరుగా లెక్చరిస్తు బల్లగుద్దిచెప్పేటట్లు కాదు. అందరూ అట్లే చదవడమువల్ల కలిగిన అనర్థము యీ ఉద్యోగము. అలాఅని చదవకుండా మానరు. చదవకపోతే పరువుకులోటు. కాబట్టి డబ్బుఖర్చు పెట్టి చదువుతారు. ఫలితము యింతచదివినా యేపుస్తకాలషాపులోనో, యేగుడ్డలషాపులోనో దూరడమో కాకపోతే Service కు 10 రు fees castor oil వేసుకొని లిస్టులో వచ్చినప్పటినుంచి యెప్పుడు Posting వస్తుందా యేపర్మనెంటు ఉద్యోగస్థుడు చస్తాడా యెప్పుడు ఛాన్సుదొరుకుతుందా అంటూ గోరీదగ్గర నక్కలు కాచుకొన్నట్లు కలెక్టరాఫీసు గుమాస్తాలచుట్టూ తిరుకడమో జరుగుతుంది. ఈసందర్భములో అక్కడవుండే డఫేదారు కూడా ప్రాముఖ్యానికి వస్తాడు. ఆయన 'డవాలీ' సర్దుకొంటూ తాను గొప్ప అధారిటీలాగ చెడవాగుతాడు. పాపం! యేకర్మవశాత్తున ఉద్యోగమువచ్చినా 6 రోజులు యే శ్రీహరికోటలోనో యే దిక్కులేని దర్శి, పొదలీలలోనో, వేయబడి నీళ్లులేక అల్లాడి నానాఅవస్థలూపడి కుదురుకోగానే ఆటోరోజు oust అవడము

సంభవిస్తుంది. అందుచేత మాబసవయ్య యివన్నిమానుకొని ఏదైతేనేమి జీవనము సరిగా సాపాటుతో గడిస్తే చాలునని నెల్లూరివాడైనా వలసలో షాపులో కుదురుకొన్నాడు.

ఇది బసవపురాణము.

అయితే గుడ్డలమ్మే షాపులలోవుండే గుమస్తాకు చదువుకొన్న భార్యయెందుకురా! నీకు ఆరుస్తుందా తీరుస్తుందారా! నీ చేయిమించి మెలుగుతుందికదరా నాయనా నామాటవినరా!

మిగతవారికి యెందుకు, మనమూ మనుష్యులంకామూ, చదువుకొన్నభార్య అయినామాత్రం మనకు లాభమేకద. ఆమెకూ ఉద్యోగం కుదిరితే నాపాతికరూపాయలతోనూ ఆమెజీతంతోను హాయిగా గడుపలేమూ.

ఇదేందిరా మగవాడవైయుండి భరణం తింటానంటావ్! నాయనా ఆడప్రభుత్వము గుడ్డిప్రభుత్వమురా.

నీవు లక్షచెప్పు నాకుమాత్రం మాఅత్తకూతుర్ని పెండ్లి ఆడడం సుతరామూ యిష్టంలేదు. చూచావా లక్ష్మీకాంతము బి. ఎ. చదువుకొన్నదట. వాళ్ళనాన్నకూడా నాకామెనిచ్చి పెండ్లి చేస్తామన్నారుకదా!

లక్షణంగా చెప్పినట్లువిందూ నీపుణ్యం ఉంటుందినాయనా.

వాళ్ళు గొప్పవాళ్లు. వాళ్ళతో వియ్యంపొందితే మనల్ని బీదవాళ్ళుములని హేళనగా చూస్తారురా!

వాళ్ళకి తగినమంత్రం నేవేస్తాకదూ! నామాటకి యెదురుగా వాళ్లు నడువగలరా చూద్దాం.

సరే, నీయిష్టం. నేను భీమశంకరరావుతో మాట్లాడుతా! తిరుగా ఆలోచించుకో సాధక బాధకాలు. యోచించుకో!

ఎట్లయితేయేమి. మాబసవయ్య పరీక్షలో నెగ్గాడు. ఓ ఉబలాటం తీరింది. వాళ్ళనాన్నని తనమార్గానికి తిప్పుకొన్నాడు. యెదురులేకుండా ముచ్చటగా వివాహానికి తయారయ్యాడు.

నాడు ముహూర్త దినం. అంతా సిద్ధంగావుంది. 'అయం ముహూర్తస్సుముహూర్తోస్తు' బ్రాహ్మల గోలగావుంది. బలే ఒకకేసు కొట్టేశారే. ఊఁ కాని చయనులూ! దీంట్లో ఘటికుడవు కదూ! నాకు సంభావన యిప్పిద్దూ అంటూ దీక్షితులు చయనుల సామర్ధ్యాన్ని పొగడుతూ 'Two birds at one shot' అన్నట్లు అలాగే స్వంతానికి దోవతీస్తూ ఆర్భాటంచేశాడు. బసవయ్య బావమరిది ఇల్లల్లా తండేపెత్తనం అంతా తనదేఅన్నట్లు హడావిడిగా వక్కపళ్ళెం ఇట్లాతే. యేరా చచ్చుపెద్దమ్మ శీఘ్రముగారా, అంటూఅవసరాధికారములతో గోలచేస్తూవున్నాడు. కాఫీతాగేవాళ్ళు తాగుతూవున్నారు. వద్దు వద్దు అంటూ

కడవెదులాగేవాళ్ళు కొందరూ. ఇలాగే కోలాహలంగా వుండింది.

సమయానికిసరిగా కైలాసరావు వివాహమంటపాన్ని ప్రవేశించాడు. ఎవరయ్యోయ్! యీాయనఅని నిర్ఘాంతపడకండి. ఈయన సమాచారము తరువాతచెబుతా!

వచ్చీరావడముతోనే బసవయ్యతండ్రిని దగ్గరకు పిలిచాడు. ఈయనగలభా డాబుచూచి బెదరుతూ రంగన్న దగ్గఱకు వచ్చాడు.

ఏమండీ! ఎవరూమీారు!

మోసపోతున్నారు మీారు. మీాకోసమాచారము మొదట చెబుతా బయటికిరండి,

నా ప్రశ్నకు బదులు చెప్పవయ్యాఅంటే బయటికి పిలుస్తున్నావేం.

అదికాదండీ, యిందులోకిటుకు నేచెబుతా ఉండండి. ఇలారండి.

సరే యేదో చెబుతానన్నాడే అని రంగన్న ఆయన్ని వెంబడించాడు. చావడిబయటికి తీసుకెళ్ళి 'అయ్యా! ఈలక్ష్మీకాంతం అనేఅమ్మాయి నిజంగా మంచికులందికాదు. వారకాంతలతోచేరింది: ఈమెతండ్రి)అని చెప్పకుంటూఉండే ఆయన అసలు ఆమెతండ్రికాదు. బరోడాలో బ్యాంకిమేనేజరుగా ఉండి

పై సంబంధంవల్ల దొరికిన ఆవిడని తన కూతుర్నిగా చెప్పుకుం టూ మద్రాసులో తలెత్తుకునిఉంటూఉండినాడు. బ్యాంకిలో డబ్బల్లాకాజేసి మారుపేరెట్టుకొని అందర్నీ మోసంచేస్తున్నాడు- నాడబ్బుయాభైవేల రూపాయలు మునిగింది వీడివల్ల. అంచేత వీడిపనిపట్టాలనుకొంటూ వెంబడిపడి తిరుగుతున్నాను.

అయ్యో! కొంపమునిగిందే! వ్యభిచారుల్తోనా సంబంధం కలుపుకోడం! అయ్యో, నాతండ్రీ! నీచదువుకొన్నభార్య మోజు యెంతకు తెచ్చిందిరా నాయనా! పాలసముద్రంవంటి వంశము నాశనమాతుందికదరా! ఓయిబాబూ! ఆపండి, ఆపండి. బసవా నిలు, నిలు. తాళికట్టబోకు, అంటూ రంగన్న వెనక్కు విఱచు కొనిపడ్డాడు.

ఈసందడిని విని అందరూ యేమిజరిగిందో అని ఆదా బాదా వచ్చారు పరుగెత్తుకొని. వీధిలో జనంకూడింది. మనలక్ష్మి కాంతానికి యింతకుముందువున్న వ్రీడాభారం అంతా యెక్కడికి పోయిందోకూడా తండ్రిఅని పిలిపించుకొనుచున్న మనిషితో కై లాసరావునిచూచీ చూడడంతోనే ఉడాయించింది.

పాపం! కైలాసరావు దిమ్మచెందిపోయాడు. జఱిగిన సంఘటనానికి. రంగన్న సమాచారాన్ని వినడంతోనే వెనక్కుపడి అఱచిచావడం అతని తెలివిని కోల్పోవునట్లు చేసింది.

కొంతలోగా తేరుకున్నాడు. అయితే ఏంవుపయోగం! పిట్టలు యెగిరిపోయాయ్. ఓయిదైవమా! ఇంతతిరిగినా నన్ను వాళ్ళు తిరుష్కరంచేసిందానికి ప్రతి యేమిచేయలేనివాణ్ణిగా చేశావుకదా. అంటూ పిచ్చియెత్తినవానిమల్లె దేవుడులేడు దేవుడు లేడు, అంటూ వీధులవెంబడి తిరుగుతూ వుండినాడు. బసవయ్యా తన Ambitionను తగ్గించుకొని చనిపోయిన తనతండ్రి జ్ఞాపకార్థముగా ఆయన యిష్టప్రకారము జానకినే పెండ్లిచేసుకొని వాళ్ళేరు వదలి గోధురామ్‌వాళ్ళ బ్రాంచిలోనే బెజవాడలో యిప్పటికీ Clerkగా పనిచేస్తూవున్నాడు. అతన్ని అడిగితే గొప్పవాళ్ళని యిపుడు చెబుకునేవాళ్ళలో పైడాబుగావుండేవాళ్ళే జాస్తినీ అని లోపల మేడిపండుమాదిరి అనిన్ని చెబుతూవుంటాడు. ఎంత సుఖముగాఉన్నా తానుమాత్రం తనతండ్రిచావుకు కారణమయ్యానని చింతబడుతూవుంటాడు.

ఇది వివాహానంతరము మనవయ్యా.

మఱిచాను. ఈయన యిపుడు వేదాంతపిచ్చిలో పడిపొయ్యాడు. ఎవరువచ్చినా రమణమహర్షి రమణాశ్రమంఅంటూ గోలపెడ్తూవుంటాడు. ఈయన్నిచూచి చెప్పేదివిని అనందించండి.



# ఉద్యోగాలకు తంటాలు.



అన్నివిధాలా ప్రయత్నించిచూచాను. నాకు స్నేహితు డుకదా నాకా మాత్రం సహాయం చేయడా అనిఅనుకొన్నాను. నాతో ఉండి నిరంతరం కబుర్లు చెబుతూ నా శ్రేయోభిలాషి గా ఉండిన సుబ్బరావుకు ఒక Position రాగానే నీవెవరోయ్! నీ మొగమే నేనెరుగను పో అనిఅన్నాడు. అల్లాంటప్పుడు నన్ను తెలియనివాండ్లు నాకేం సాయం చేయగలుగుతారు?

బంధువులు నాకు పుష్కలంగా వున్నారు. ప్రతివాళ్ళూ నేను వీథిలో వెళ్ళుతూవుంటే Congratulations పరీక్షప్యాస యూవ్ మరినీ Future programme ఏంటి అని అడిగేవాళ్ళే అయితే ఉద్యోగం ఖాళీగాఉందిబాబూ! కొంచెం Help చేద్దు రూ అని నేనడిగేటప్పటికల్లా ప్చ్! ఏం ఉద్యోగాలోయ్ 2 ఖా ళీలు ఉంటే దానికి బోలెడు Applications తిరుగా అధికార్లకి ఎవడో ఒకడుంటాడు మచ్చిక కుక్క వాడికి మొదటనే ఉద్యో గంఇచ్చి అందరికీ తృప్తి అయ్యేలా న్యూస్ పేపర్లలో అడ్వర్టయిజ్ మెంట్లు వేస్తారోయ్ అంటూ పెదవివిరుస్తూ వస్తా నంటూ వెళ్ళిపొయ్యారు.

మరి ఈ God forsaken place లోనే నుండకూడదు.

అని తీర్మానం చేసుకున్నాను. నామనస్సు పరిపరివిధాలా పరిత పిస్తుఉండింది. మరి ఏమీ దిక్కుతోచలేదు. అలా బజారులో జనంపూర్తిగా సమ్మర్దంగా వున్నాకూడా వంచిన తలయెత్తకుండా పోతూవుండినాను. పోతూపోతూ యెవరిపైనపడ్డానో ఏమో నాకు ఎదురైనఆయనా యిద్దరం ఒకరిపైన ఒకరం పడ్డాం. ఆ దెబ్బకు మార్కెటువ్రక్కన వాసనలీనుతూ ఉండే సైడ్ కాలువ లోపడ్డాం, కాని దాని పుణ్యమా యిది. నేను మాత్రం పైన వుండడంచాత నాకు ఆసనంగా తయారు అయిన పెద్దమనిషికే ఆ అన్యాయం జరిగింది.

కోల్ తారుమాదిరిఉన్న ఆ పరిమళజలం ఆయన ఒంటికి అతుక్కుంది. ఆయన పడడంచేత పైకి యెగజిమ్మబడిన కొన్ని బిందువులు నాకుపడ్డాయ్. సైడ్ కాలవ అంతవెడల్పు వుండిందా అంటారేమో. ఆయనపడిన Position అలాంటిది. మార్కెట్టుకు ప్రదేశం ప్రత్యేకింపబడ్డాకూడా ఆదోవలో రెండెద్దులబండ్లూ అవీ ఇవీ అన్నీ మహాజోరుగా రావడమూ, కూరలని కొనడానికి వం గిబేరం చేస్తున్న మనుష్యులల్లా తటుక్కున నడ్డిలేవనెత్తడం ఈ రాయిడినీ భరాయించలేక తూలి వెనక్కిపడేవాండ్లు ఇలా అ యిరుకురోడ్డులో సర్వసాధారణం.

ఈ విషయంగా అక్కడవుండే పోలీసువానికి చెప్పగా ఆయన మూకీభావంతో స్థబ్ధుగా ఉండడంకూడావుంది. మరేం,

మార్కెట్కి బుట్టలుతీసికొనివచ్చే ఆడజనంపైన జబర్దస్తీచేసి వాళ్ళదగ్గరడబ్బూ, కూరలూ వసూలుచేయడమే పీరెరిగిందిగాని, అసలు Heavy wheeled traffic కూడదు అనేసూత్రం యెలా తెలుసుంది!

ఇవన్నీ అలాగుంచి మళ్ళీకథకువస్తాం. ఎలాగో ఇద్దఱం బయటపడ్డాం. సారీ, Excuse me లతో రంగం మొదలిడింది. ఆయనను అంతకుముందు నేనెప్పుడూచూచిందిలేదు. పాపం! తాను పడడానికి నేను కారణం అని తెలిసినాగూడా మర్యాదస్తుడుకాబట్టి, 'ఏమీ ఫర్వాలేదు లెండి. మీరెవరండి' అని అడిగారు.

అడగడమే తడవు. మళ్ళీ ఏకరువు పెట్టాను. నావిషయంగా తెలియాలసిన సమాచారములని.

'అయితే మీకు ఉద్యోగం దొరకలేదనేచింత ప్రబలంగా వున్నట్లుతోస్తుంది. మరేం అనుకోకండి. ఈకాలంలో ఉద్యోగాలు దొరకడం కష్టంఅని ప్రతివాళ్ళూ అన్నాగూడా మన జీవనానికి మార్గం సంపాదించుకోడం అంత కష్టంకాదు. మీకు తగిన ఉపాయాలు చెప్తాను. ఇంకోసారి కలుద్దాం' అన్నారు.

ఇంతలో వారియిల్లు సమీపమైంది. గుడ్‌మార్నింగ్‌సర్ అని ఒకసెల్యూటువేసి ఏసంఘర్షణాలేకుండా స్నేహితం చేసుకున్నాముకదా అని సంతోషంతో మామామఇంట్లో బస కాబట్టి

అక్కడికి చేరుకున్నాను. ఇదంతా ఉదయంజరిగిన సంగతి.

హాయిగా స్నానంచేసి భోజనం పూర్తిగావట్టించాను. ఇది విద్యాభ్యాసంముగిసినతర్వాత విరామకాలంకాబట్టి భోజనానంతరము భుక్తాయాసంవల్ల కొంచం శయనం సాగించాను. మధ్యాహ్నము 2 గంటలుకాగానే ఇంట్లో కాలునిలువలా. మరి సంచారంచేయడం మొదలెట్టాను. మన మొహాన్నిచూచి మనకెవరూ ఉత్తరం రాయకపోయినా ఆ ఉబలాటంగూడా తీరడానికి Self-addressed కార్డులనూ, బుక్కుపోస్టులనూ అప్లికేషన్ ఫారాలనూ తెప్పిస్తూవుండగా తీవ్రంగా మరీఆలోచనాసాగరంలో మునిగిపోయినట్లు వీధుల్లో వాటినిచేతబట్టి చదువుతూపోవడం అలవాటయింది. దీంట్లో ఏమీ అస్వాభావికంగా లేదు. ఆంగ్లరచయిత ట్రొల్లోప్ ఐర్లాండులో పోస్టల్ డిపార్టుమెంటు సర్వేయరుగా వుండగా ఒక out of the way placeలోవుండే భూస్వామి పోస్టుఅధికారులకు ఉత్తరాలు వ్రాసేవాడట. పోస్టల్ సిస్టముసరిగా పనిచేయడంలేదని అంచేత ట్రొల్లోప్‌ను పంపినారట. ఆయన ఘరానామనిషిన్నీ, truthful గా పనిచేసే ఆయన. వెళ్ళుతూనే ఆయనికి ఆ భూస్వామి సర్వోపచారాలు చేశాడట. ఈయన కంప్లెయింట్ విషయంఎత్తినప్పుడల్లా 'శ్రమతేర్చుకోండి ఏమీ లేదులెండి మరి యీ అరణ్యంలో నాకెవ్వరూ సరియైనవాళ్ళు లేరు. మాట్లాడ

డానికిగాని, తమాషాగా ఉండడానికిగానీ. అంచేత పోస్టువారితో Correspondence పెట్టేది. అంతా జరుగుతూఉంది. చూడండి ఫయిల్సు ఎలాగా పెరిగాయో' అని జవాబు చెప్పాడట! ఇలాగా ఉంటారు కొందరు. అలాంటివాళ్ళలో మరేమీ పనిలేని నాబో టివాళ్ళూ సమృద్ధిగా ఉన్నారు.

మధ్యాహ్నం తపాలుకుపోయి అక్కడ Postman ని పిలుస్తూ గోలచేసి ఆకిటికీదగ్గర గంటసేపు నిలుచోని వాని ప్రాణం తీసి కడకు ఏమీ ఉత్తరంలేదని వాడుచెప్పగా అయ్యో! సరిగా చూడు. ఈవేళ తప్పక వచ్చివుండాలనే. ఏమికారణం అంటూ అందరికీ తెలిసేటట్లు గొణుగుతూపొయ్యేది వాడుక. ఆవేళ కూడా ఈ తతంగం జరిపాను అలవాటుపైన గ్రహపాటన్నట్లు.

ఉదయం కలుసుకోన్న పెద్దమనిషిని చూడడానికి వెళ్ళాను. ఆయన రెవెన్యూ బోర్డు కమిషనరు. ఆఫీసులో పని అంతగాలేదు కాబట్టి ఇంటిలోనే ఉన్నారు ఆవేళ. హాయిగా ఈజీచేర్ పైన పండుకొని గాలి పీలుస్తుండినారు. నన్ను చూడ డంతోనే ఒరేయ్! రాముడూ! ఓకుర్చీ ఇలా పట్టుకోరాగా అని అన్నారు. ఓ పండ్రెండేండ్ల కుర్రాడు ఓ ఆఫీస్ చేరును నాకు వేశాడు. కొంచెంసేపు ఆయన గ్యాస్ బాగా వదలాడు.

అయితే మీరు ఉద్యోగం దొరకలేదన్నారుగదా. అన్ని ప్రైలుచేశారా?

నాకు తెలిసిన మార్గాలన్నిటినీ చూచాను.

వ్యాపారం చేయడానికి మీాకిష్టముందా.

వ్యాపారం మొదలెట్టడానికి మొదట ఆజ్యం కావాలికదా. మరి దానికిగతిఉంటేగా

భయపడవద్దు. ఆ క్యాపిటల్ నేను ఇస్తాను. మీారు కానివ్వండి.

అయితే ఏం వ్యాపారం చెయ్యమన్నారు

శెట్లతో మీారు నెగ్గలేరు. పుస్తకాల వ్యాపారంచెయ్య వచ్చనుకుంటా.

అలాగే మీారుచేసే సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి.

ఏమీాలేదులేండి: మనలో మనం, మనకులం వాళ్ళకి సహాయం చేసుకోకపోతే ఏలాగ? నేను వస్తాను అని సెలవు పుచ్చుకున్నాను.

3

పుస్తకాలవ్యాపారం పెట్టాను ఆయన యిచ్చిన 5 వేల రూపాయలతో.

స్కూలులో మనకు తెలిసిన అయ్యవార్లేకదా పుస్తకాల లిస్టు మొదటనే తెలుపరా అని అనుకొన్నాను. అయినా వాళ్ళని నమ్మేందెవరూ? ఒకాయన నాకు బాగా తెలిసిన పెద్దమనిషి నాకు లిస్టు యిస్తానని తప్పుడులిస్టును యిచ్చాడు. అవతల ఆయన్ని అడిగితే అవునంది. మొదట మారవనుకొన్నాం. కమిటీతీర్మానం

చేసి మార్పులు చేశారు అన్నాడు. అదేంటండి. స్కూలు తెరిచినతర్వాత ఇన్నాళ్ళకి మీరీవిధముగా చెపితే ఇంతకుముందే సరియైన పుస్తకాలు అప్పాదురై గాడు తెప్పించాడే అని బుకాయిస్తే ఏదోపాపం అని obligeచేసిందానికి బలేఅయింది అంటూ చీత్కారం చేస్తూ వెళ్ళాడు.

ఇంకా నాక్లాస్ మేటుగా వుండేవాళ్ళలో కొందరు బోర్డు స్కూళ్ళలో సర్వాధికారాలు సంపాదించి ఉండడంచేత పుస్తకాల కాంట్రాక్టులు ఇస్తారుకదాఅనిఆసించాను. అయితేనాతో ఇస్తాననీ నా ప్రత్యర్థి అప్పాదురై గాడికి ఇవ్వడం చూస్తూవుండినాను. ఒకాయన మొహమాటంలేకుండా నాతో చెప్పాడు. అయ్యా వాడన్నిటికీ పాల్పడుతాడు. డబ్బు ఇప్పుడుగాదు రేపురావోయ్ అంటే పోతాడు. మాకుకొంచెం కమిషనులు వస్తాయి. ఎన్ని తంటాలు పెట్టినా వాడుభరిస్తాడు. మీరు చదువుకున్నవాళ్ళు. మిమ్మల్ని ఆవిధంగా శ్రమపెట్టడం ఉచితంకాదుగదా అని యన్నాడు.

పబ్లిషర్లమనికూడా మాకంపెనీకి ఒకతోక తగిలించాను. సరే. ఒకపెద్దాయనను పెట్టుకొని ఆయనచేత కొన్ని పుస్తకాలని పాఠశాలకు తగినట్లుగా వ్రాయించాను. ఇంక టెక్స్టుబుక్ కమిటీ వాళ్ళు వీళ్లు అని అందరితో నానాఅవస్థలు పడ్డాను. కమిటీ మెంబర్లకి ఏమీ యిచ్చుకోడాలు పుచ్చుకోడాలు లేకపోతే యేమీ లాభంలేదనితెలిసి అన్నంతాచేశాను. అయితే స్కూళ్ళలో పెట్టడానికి ప్రెసిడెంట్లకీ, సెక్రిటరీలకీ, వీళ్ళకీ యేమయినా

ఇచ్చుకోకపోతే జరగదని ఆ అన్యాయానికి పాలుబడ్డాను. ఏలాగో చావుతప్పి కన్నులొట్టపోయింది అన్నట్లు లాభంలేకపోయినా ఖర్చులు సరిపొయ్యేట్టు అయింది. అంతటితో పూరకొంటినా. కొనుగోలుచేసినవాళ్ళకల్లా కొంత something ఇవ్వడం మొదలెట్టాను. ఎలాగో ఓపాజిషన్ తెచ్చుకున్నాను. నావిజయాన్ని చూచి నాఅభ్యుదయానికి కారణమైన కోలాచలంపంతులుగారు తమకుమార్తెను నాకిచ్చి వివాహంచేశారు. ఇది నాయుద్యోగ ప్రాప్తిపురాణము.

కాబట్టి నాయనలారా, ఉద్యోగాలులేవని అవస్థపడకుండా ప్రకృతిలో ఏ అన్యాయానికి పాలుబడ్డా ఫలందక్కేట్టు చూచుకోమని మనవి. వివరాలుతెలియాలంటే కూపావుకొస్తే Sure guide to success అనేపుస్తకంవుంది. దాన్నికొని చదవండి. ఉద్యోగ మర్మాలు తెలుస్తాయి.



# చతుస్సాగర పర్యంతం

ఛీ! ఛీ! ఎక్కడచూచినా ఇంతేనా! అబ్బ! అంటూ తూష్ణీకరిస్తూ కృష్ణయ్య మా యింటికివచ్చాడు.

ఏంపంతులూ! ధుమధుమలాడుతూ వస్తున్నావ్! ఎవరైనా ఏమైనా అన్నారాఏంటి నిన్ను!

ఏం చెప్పను! దర్బేశిగాళ్ళకు డబ్బిచ్చి అవస్థపడుతూన్నా నాయనా!

పరోపకారార్థం మిదంశరీరం అంటారుకదండీ!

బాగానేఉందే! నాదగ్గరనుంచి డబ్బుతీసుకొనేప్పుడు బలే ఉరవడిగా రేపుతప్పక ఇస్తానండి అని చాలాజోరుగా చెప్పారు కదా!

పరిస్థితులను చూచికదండీ మీరుమాత్రంచెప్పాలి. పాపం! ఇవ్వాలనే అనుకొనే ఉంటాడుకాని ఇవ్వకూడదని ఎగ వేయాలని ఎవరైనా అనుకొంటారా?

ధర్మపన్నాలకేమండీ! ఇపుడు చుట్టూతా నన్ను త్రిప్పుతున్నాడు. పోనీ! ఇవ్వవయ్యా! నీ టైమ్ చెప్పవయ్యా అని అడిగితే అలా చెప్పడానికి ఎలాఅవుతుందండి బ్రహ్మలమా ఏంటి మనం డబ్బువస్తేకదా ఇవ్వడానికి, వచ్చినప్పుడు ఇస్తానులెండి'

అన్నాడు. 'అదేటండి ఓ అప్పుడు ఇవ్వగలనని అయినా చెప్పక పోతే ఎలాగ! ఊరికే మీ చుట్టూతా మేం తిరగడానికన్నా ఏదో ఫలానా టైమ్ అని చెప్పితే అప్పుడు రావచ్చుకదా, అన్నా. అని అనడంతోటే ఆ మనిషి బుసకొట్టి పోవయ్యా! మహాఇచ్చావు పుకాని! దావాచేసుకో, కోర్టుద్వారా రాబట్టుకో అన్నాడు కదా! ఇలాంటివాళ్ళని ఏంచెయ్యడం?

నాకూపాపం! కృష్ణయ్య ఆరాటాన్ని ఆవేదనాన్ని చూడ లేకపోవడమయింది.

ఎంతప్రయత్నించినా అతనికి ఎవరుకూడా సరిగా డబ్బు ఇవ్వడంలేదు. అంగడిలోనుంచి సామానులనిమాత్రం ఖరారుగా తీసుకొంటారు. అవతల డబ్బుకు వెడితే ఇలా అవస్థపడతాడు.

అతనూ ఏం అట్టై ధనవంతుడుకాదు: ఏకై వచ్చి మేకై బిగించారన్నట్లు అప్పుసొప్పు తీసుకొనే జనాభా అంతా మొత్తసి వాడుకాబట్టి నెత్తిపెకి కూర్చోవున్నారు. వంచేస్తాడుపాపం!

నేనూ వర్తకంచేస్తూన్నా. అయితే అప్పు ఇవ్వడం అనేది నేను పెట్టుకోలేదు. ఏదో దినసరి లెక్కలని సరితేల్చుకొంటూ అధికాదాయాలకి ఆశపడకుండా జీవితంగడుపుతూన్నా!

ఇంకా సాగించాడు కృష్ణయ్య తన శాపనార్థాలని.

మొన్నతీవ్రంగా ఉపన్యాసం ఇచ్చాడండీ ఆ పెద్దమనిషి. బీదజనాన్ని అల్లాడించే, ప్రజాసామాన్యం రక్తాన్నిపీల్చే ధనిక

పిశాచాలని ఏమనడం అంటూ! మాబోటివాళ్ళ రక్తాన్ని పీలుస్తూ మా ప్రాణాలని తీస్తూకూడా!

అయితే పంతులూ! అలాంటివాళ్ళకి ఎందుకు బదులివ్వడం. తిరుగారాదని తెలిసీకూడా?

బాగావుంది. మరి వ్యాపారంలో ఆవిధంగా నిక్కచ్చిగా వుంటే జరుగుతుందా?

నరేనయ్యా! ఎంతవరకు నిక్కచ్చిగావుండాలో అంతవరకు ఉండాలసింది. మిగతకి మరేంచేదాం? ఇలాంటిఘోష మన దేశదు తెలిసిందా! చతుస్సాగరపర్యంతం ఇలాగే లావాదేవీలతో అవస్థపడుతూనేవుంటారు.

చూచావూ! అక్కడనే మీతప్పు. విదేశవ్యాపారస్థులు ఎవుడూ కఠినంగా వుంటారుగా.

వారిస్థితికీ, మనస్థితికీ వేరుకదూ. అప్పతీర్చకపోతే తీరని అవమానం అనుకుంటారువారు.

వాళ్ళలోవారికి లావాదేవీలుంటాయ్‌మరి. మరీ విదేశాలతో వ్యవహారించేటప్పుడు ఆవిధంగావుంటే ఎలాగ?

ఇంతలో లోపలినుండి పిలుపు వచ్చిందినాకు.

కొంచెంవుండు కృష్ణయ్యా అంటూ బుజ్జాణికూర్చోబెట్టి లోపలికివెళ్ళి వచ్చాను.

కొంచెంనసుగుతూ కృష్ణయ్య అడుగలేక అడుగలేకటరాయిస్తూవుండినాడు.

ఏం! సమాచారం! అన్నాను.

మీరు నాకు కొంచెం ఇవ్వాలికదా! జ్ఞాపకముందీ! చాలా కసాలాగా వుందండీ! ఇస్తారూ? ఎంతో పుణ్యంవుంటుంది అంటూ బ్రతిమాలాడు.

నాముఖం చిన్నదయింది. నన్ను సంబంధించంతవరకు జోరుగా ఉపన్యాసం యివ్వకలిగాను. నాదగ్గిర డబ్బు కొంచెంవుంది. అయినా అదిపోతే ఇంటికి ఇబ్బందౌతుంది. ఏం చేయను.

నేను తటపటాయించడం చూచాడు కృష్ణయ్య! దయవుంచునాయనా! ఇప్పుడు డబ్బులేకపోతే నేనెంతో అన్యాయమౌతాను.........

సరే. ఇద్దాను డబ్బుని! ఇస్తే, గారికి చీర ఇవ్వకపోతే ప్రాణాలు తీస్తుంది. ఇక రెండురోజులలో సర్దితే సరిపోతుందివీడికి, ఎలాగూ ఇనాళ్లు ఓపికపడ్తూవున్నాడు. ఇక రెండురోజులు తమాయించుకోగలుగుతాడులే, అనిఅనుకున్నా!

కృష్ణయ్యా! నాకూ డబ్బుఅవసరం చాలావుంది. మీకు నేను ఇప్పుడు డబ్బిస్తే ఇంట్లో కష్టంఅవుతుంది. కొంచెం ఓపికపట్టే రెండురోజులలోగా సర్దుతా అన్నాను.

ధర్మపన్నాలని వర్ణించావుకదా! నాస్థితి నీకు తెలుసుకదూ అట్టే నేనేంచెప్పడం నీకు.

ఏంచేయడం? నాకూ చాలాకష్టంగావుంది. కొంచెం ఓపికపట్టకూడదూ?

నేనిక నీతో చెప్పలేను. సంగతిఅంతా తెలిసిన నరమానవుడివి, నీవే ఇలాఅంటే ఎలాగ? నాకు పూటకి భత్యమైనా దొరకడంలేదు.

ఊరికే ఎందుకీ శుష్కవాదన. ఇప్పుడు నీవేచేసినా నేను ఇవ్వడానికిలేదు. వృధాగా అడిగితే ఏంఉపయోగం?

తదుపరిరంగాన్ని వర్ణించడానికి నాశక్యంకాదు.

ఏదో చాపల్యంచేత ఇవ్వనన్నా. అతడు వెళ్ళింతరువాత చాలానొచ్చుకున్నా. తప్పు అని తెలిసినా తప్పునేచేయుడానికి వీలైందికాని న్యాయప్రవర్తనానికి చేతగాకపోయింది. పాపిష్టి దేవుడు నన్ను మంచిగానడవడానికి బుద్ధిఅయినా ఇవ్వలేదు. అయితే ప్రపంచంలో చతుస్సాగరపర్యంతం ఇంతేకదూ? నేనూ ప్రపంచంలో అందటివలెనేకదూ? అంటూ నిందిస్తూఉన్నఅంతరాత్మని నోరుమూయించాను. మీరు చెప్పండిమఱి. ఇంతకూ ఏంచేయగలం? ఎక్కడా ఎవరూ ఇంతేకదూ!



# ధర్మం మోహం పడింది?



"ఎప్పుడూ మాయింటకి రావడమంటే అసహ్యాపడే భావ రావు ఆవేళ లేనినవ్వును తెచ్చుకుంటూ కళకళలాడుతూ వచ్చాడు.

ఏమయ్యా! ఏంచేస్తున్నావు ఎప్పుడూపనేనా!

నేను నిర్ఘాంతపొయ్యాను. ఇదేంటారి ఇన్నాళ్ళూ ప్రక్క-యింట్లోవున్నాకూడా నన్ను చూచినప్పుడల్లా మొహం చిట్లించు కొంటూ పొయ్యేఆయన యీ దినము యిలా మాట్లాడు తున్నాడేం అనుకొన్నా అయినా యీ పరివర్తనకు ఏదో కార ణముండితీరవలె. లేకపోతే యీాయన మనయింటికి వస్తాడా! అని అనుకొని, 'ఏమిబాబూ! ఏంచేయము! పొట్టకూటికి పని చేయద్దూ! మేము ఈ విధముగా పనిచేయకపోతే గడుస్తుందా!'

అదికాదు. ఒళ్ళు బాగావుంటుందోలేదో చూచుకొని మరీపని చెయ్యాలితెలిసిందా! ఊరకే పనచేస్తే దేహంపాడై తే యేంచేస్తావు? నీవుపండుకుంటే మరి నీ ఆలుబిడ్డలగోడు యెవరు చూస్తారు?

'అదేమండీ అలాగంటారు, శ్రమపడకపోతే కూటికి కఱ వాయెను. ఏంకష్టంపడ్డా వచ్చేదేమో కొంచెమే. కాని అలాగని ఊరకేఉంటే యెట్లా? కుడిచికూర్చొని ఉండేవాళ్ళకి ఈ ఆలోచ

నలు తట్టుతూఉంటాయ్. పనిలో మునిగివుండడంచేత మాకీవిధ ముగా తోచదు. మేము అవస్థపడితే కాపాడడానికి మీబోటి ధర్మాత్ములున్నారుగా!'

భావరావు మొహంపాలిపోయింది క్షణమాత్రమున. కాని వెంటనే అది మారిపోయింది.

తిరుగానవ్వుతూ, 'అవును కాని నాగయ్యా! కుటుంబానికి నీవే ఆధారముగదూ. అప్పుడు నీవు లేకపోతేయెట్లా?'

వాటికేంబాబూ! రేపటిసమాచారము దేవుడే చూస్తాడు. కానిబాబూ! యెన్నడూరానివారు యీదినము మాయింటిని పావనముచేశారుగా. కారణముయేమిటో చెబుదురూ.

భావరావు కొంచెం తమాయించుకొని చెప్పడము మొదలెట్టాడు.

'నాగయ్యా! నీతో నాకుకొంచెం పనివచ్చింది. ఒప్పుకొన్నావా నాకు సహాస్రంమేలుచేసినవాడవవుతావు.'

అనుకొన్నంతే అయింది. మనవల్ల ఆయనకు అవసరం వుండడంవల్లనే ఆయన యీ తట్టువచ్చారు. ఇప్పుడు ఆయన చెప్పిందానికి తల ఊపకపోతే సమయమువచ్చినప్పుడు బొక్కపెడ్తాడు. అయినా విందాం అనుకొని, 'అదేంటో చెప్పండి బాబూ! చేతనైతేచేస్తాను.'

అదుగో! అయిత్తే అని సందేహాముగా చెబుతున్నావే.

కాదండీ! చెప్పండిచేస్తాను.

కోర్టులో నాకొకదావావుంది. నీవు నాతట్టు సాక్ష్యం చెప్పాలి.

స్వామీ, కోర్టుసమాచారమా, అబ్బో! గాభరాగావుంది. మీకు కోటిదణ్ణాలు. నన్ను విడిపించండిదేవరా!

అరే! యేంభయమోయ్! ఏమీలేదు. ఒక ప్రశ్న నిన్ను అడుగుతారు, నీవుతొణక్కుండా బదులుచెప్పాలి. ఊ! అను చాలు.

వద్దుస్వామీ! ఏదోమూలలో వుండేవాణ్ణి ఊరకే ఉండనివ్వక కోర్టుకులాగుతారేంటి బాబూ! క్షమించండి.

దానికి ఒప్పుకోడానికి వీలులేదు. నీపేరు సాక్షులలో వేయించాను. రాకపోతే కోర్టువారు నిన్ను వదలిపెట్టరు.

నాకు భావరావుపైన ఎంతోకోపమువచ్చింది. అయినా యేంచెయ్యను. ఆయన ధనవంతుడు. ఏవిధముగాచేసితే ఆ విధముగా సాగుతుంది. నాబోటి బుడ్డాఫకిర్లుచెప్తే యేం నెగ్గుతుంది? ఏందావానో, అసలువిషయము మనకుతెలియదు. అన్యాయానికి సహాయముచేస్తే మనకు పుట్టగతులు అసలేవుండవు. ఎలాగా తప్పించుకోవడము.

బాబూ! మీమాట తోసెయ్యడం నాచేతకాదుకాని...

అదో తిరుగా పెట్టావే అడ్డుపుల్లని నీకేం భయంలేదు. నేను అభయం యిచ్చాగా.

ఇక చేసేదిలేక సరే అన్నాను.

౨

భావరావు లక్షాధికారి. వాళ్ళ నాయన చిన్నతనములో చాలాబీదతనాన్ని అనుభవించాడు. తుదకుస్వయంకృషివల్లనైతేనేమి అదృష్టము పట్టడమువల్లనైతేనేమి ఆయనపట్టిందల్లా బంగారమై ధనవంతుల్లోకల్లా మేలుచెయ్యి అయ్యాడు. దారిద్ర్యయాతనను అనుభవించిన పెద్దమనిషికాబట్టి బీదవాళ్ళని చాలా గౌరవముతో చూడడమునూ, వాళ్ళకు సహాయము చేస్తూ వుండడమునూ సంభవిస్తూవచ్చింది. అందువల్ల ఆయన పేరును అందరూ తలచుకొంటూ వచ్చేవారు సామాన్యజనమంతా కూడాను. అజాత శత్రువు అనే బిరుదు ఆయనకువుండేది. అయితే భావరావు చిన్నప్పటినుంచీ తల్లిచాటున పెరిగినమనిషి అనడంచేత యేలోపమూలేక కాలము సౌఖ్యముగాగడిచింది. కొంచెము పెంకె అలవాట్లు, గర్వము యివీ అవీ అన్నీకూడా సంక్రమించింది. తండ్రిగారు చనిపోయినతర్వాత ఆస్తికి వారసుడై చాలా వైభవముతో మెలగడం మొదలెట్టాడు. సహవాసము ప్రబలింది.

ఈ సందట్లో ఒక సంఘటనము కలిగింది భావరావు స్నేహితులలో శంకరరావు ఒకడు. వీడు చాలా ఉద్దండుడు. వీడిపేరుచెప్తే ప్రతివాళ్ళకీ యేవగింపుపూర్తిగావస్తుంది. అల్లరికి పేరుపెట్టినవాడు. భావరావుకు అంతడబ్బున్నాకూడా అప్పుతీసుకోవడముమాత్రం పోలేదు.

చయనులు శ్రోత్రియ బ్రాహ్మణుడు. కొద్దో గొప్పో వున్నదాంతో తృప్తిపడి వుండేఆయన. ఆయనకు మొదట్లో భావరావునాయన చాలాసహాయము చేశారు. అందువల్ల ఆకుటుంబాన్ని యెంతో కృతజ్ఞతతో ప్రేమతో చూచేవారు. ఎపుడూ వాళ్ళక్షేమానికోసరం తనశక్తివుండేంతవరకూ పాటుపడడానికి సిద్ధముగా ఉండేగుణం ఆయనది. ఓరోజు భావరావుకు డబ్బు అవసరముగా కావలసివచ్చింది. ఒకటికాదు, రెండుకాదు, పదివేలరూపాయలు. కారణమేమో తెలియదు. ఇంతమొత్తము యెక్కడనుండి వస్తుందిఅమాంతంగా?

చయనులు కష్టపడ్డారు. ఇతన్ని ఆపదనుంచి తప్పించేది యెలాగా? అంటూ, పరిపరివిధాల ఆలోచించి ఆఖరుకు యెలాగైతేనేం ఏళ్ళకీ వాళ్ళకీ ప్రోనోట్లువ్రాయించి డబ్బును సంపాదించి భావరావుకు యిచ్చాడు. భావరావు రహస్యముగా ఒక కూ్రరకృత్యములో తెలియకుండా యిరుక్కొన్నాడు. ఈ డబ్బు దానికి లంచము. దీనికంతా శంకరరావు ప్రోత్సాహము.

ఇప్పుడు అందరూ చయనులు పీకెపైకి వట్టుకొన్నారు. ఆయనను డబ్బుయిచ్చివేయమని అందరు గోలచేయడము ఆరంభించారు. చూడండి! చయనులు డబ్బు అడిగితే భావరావు నీవు నాకు డబ్బుయివ్వనేలేదుపో, అన్నాడట.

చయనులఅవస్థ వర్ణనాతీతము. గొప్ప వంశము, గొప్ప వారిబిడ్డ. సాంప్రదాయకముగా మంచిగుణములు వాళ్ళఛాయ

యెక్కడపోతుందని నమ్మియిచ్చిందానికి ఫలంయిదేనా? అంటూ ఆయన మనసు విరిగిపోయింది. ఏంచేయడం! చనిపోయిన పెద్ద మనిషిని తలంచుకొని వీణ్ణివదలడమూ కాకపోతే కోర్టుద్వారా రాబట్టుకోవడమా?

చయనులకు కాస్త అయినా లౌక్యము తెలియదు. 'ధర్మము జయిస్తుంది' అని ఆయనకు గట్టినమ్మకంవుంది. అందువల్ల నేరుగావాణ్ని అడిగి మరీవదలుకొందాం అని అనుకొని భావరావు యింటికొచ్చాడు. ఇక్కడ యేమోజరిగింది. ఫలితము చయనులకు ఆస్పత్రిలో స్మారకములేకుండా పడుకోవలసి వచ్చింది. ఇదీకథ.

3

నాకేమీ తోచలేదు ధర్మము యేతట్టో మనకేం తెలుసు. నా అంతరాత్మ భావరావుతట్టు పలకడానికి యిష్టపడలేదు. ఇలా యేమితోచకుండా వెలక్కాయ గొంతులో బడ్డట్టు మిణకరిస్తూండినాను. ఏమిచేయను? ఎంత కులంచెడ్డవాళ్ళమైనా కడుపు కక్కుర్తికి హీనముగా ప్రవర్తించడానికి ఇష్టములేదు. ఏమీ తోచకుండా యేటివైపు వెళ్ళాను. గుసగుసలుకొన్ని వినబడ్డాయ్.

వాడు వొప్పుకొన్నట్లు చెప్పాడేకాని నమ్మడానికి వీలు లేదు. ఇలాంటివాళ్ళను నమ్మితే కొంపమునుగుతుంది. నాకావిధముగాతోపదు. చాలామెత్తనివాడు. ఈరెండువాక్యాలూ నన్ను గురించి చెప్పబడుతూ వుండేట్టుతోచింది. సావధానముగా విందా

మనే అభిప్రాయముతో తుప్పలచాటున దాగుకొన్నాను. చీకటి వస్తూవుంది. మసకమసకగాఅగుపడుతూవుందివస్తువులన్నీ కూడాను.

'శంకరరావు యిప్పటికే ఊరిలో అందరినోట్లో నానుతూ వున్నాను. నాకు పేరులేకుండా పోతూవుంది. ఇకమీదటనైనా కొంచెము జాగ్రత్తగావుండాలి.' నేనున్నాగా. నీకుభయమెందుకు? కాకర్ల పురుషోత్తము భార్యవిషయములో యెంతసహాయము చేశానో చూచావుగా.

చయనులు లేకపోతే పరువునూాలమట్టమయివుండేదిగా. అవునయ్యా! వీళ్ళంతా మన అవసరానికి యేర్పడ్డవాళ్ళేమరి నీకెందుకు నేను ఆల్ రైట్ చేస్తాగా!

చయనులు పాపం! నేను కొట్టినాకూడా ఓర్చుకొని చూస్తుండినాడు కాని యేమిచేయలేదు. చూచావూ ఆయన మొఖములో ఆజాలి ఆకళ నా మనస్సును కలతపెడ్తూవుంది. రాత్రింతా అయోమయముగా వుండింది?

పిరికిగుండెల అవస్థయింతే. ఇలాఅయితే మనకార్యాలు యేవిధముగా జరుగుతుంది ఇవి తెలిసిఉంటే మొదలిడేవాళ్ళమే కాదే.

భావరావు కొంచెము కలవరపడ్డాడు.

అయితే యిపుడేంచేదాం.

వీడేమో సాక్ష్యము యిచ్చేటప్పుడు మనకు అపాయము చేయకలుగుతాడు. అంటే తెలిసీతెలియని ఘటం అవడంచేత

వీనివల్ల మనకు మోసమువస్తుంది. వీడ్నిపైన నేరముమోపుదాం.

చయనులతరఫున చేయబడ్డదావాకు తోడుయిదీ చేరితే?
నీకెందు కాభయము. చయనులు తేరుకోలేదు, రేపోయెల్లుండో
చస్తాడు. అక్కడజరిగింది యెవరికీతెలియదు మనకేంకష్టము
లేదు......కోర్టుకా!ఉండు...ఉండు...

భావరావు ఆతురతతో శంకరం యేంచెబుతాడా అని
నిలబడ్డాడు-

నాకు విషయము రసపట్టులో వుండడంవల్ల వీళ్ళ ద్రోహ
ము బట్టబయలు అవుతూవుండడం మూలాన సావధానుగా
చెవులు నిక్కబొడుచుకొని వినడానికి తొందరపడుతూ వుండి
నాను. నామనోవ్యధ వర్ణించడానికి శక్యముకాదు. 'చయనులని
వీడేకొట్టాడని అందువల్ల ఆయన చచ్చాడినని అంటే.'

ఆయన బ్రతికితే

అబ్బ! యెప్పుడూ అపశకునం, తప్పకుండా చయనులు
చచ్చేటట్టు చేస్తాను. ఇదీ తొందర. మరివస్తా.

ఈ శంకరరావుని మింగేద్దామా అని అనుకొన్నాను.
అయినా ఉద్దేశము మరల్చుకొని ఇంటికి వెళ్ళాను. ఏంకొంప
మూడుతుందో అని వెళ్ళిపోదామనీ ఊరువిడుస్తామనీ అను.
కొన్నా. అయితే వూరువిడిచినా పోలీసుపిశాచాలు నన్ను పట్టు
కోగల్గుతాయ్. భార్యతో చెప్పాను. ఏమేవ్! నాకు కాలము
మూడింది, ఇన్నాళ్ళు సంతోషముగా గడపిన మనకు యిక కడ

గండ్లే అని నా వృత్తాంతము నేను పొందివిన్న సమాచారము తెలిపాను.

ఇంతకూ మనమేంచేదాం. ధర్మంజయిస్తుందిలేండి అధై ర్యపడకండి. అని అనింది. అలాంటి పత్నికలగడంవల్ల నేను యెంతోధనుడ నయ్యాను.

దైవాన్నే సంస్మరించుకొంటూ, ధర్మమేజయం అనుకొంటూ ఉదయం యేమవుతుందో అనేచింతను పారద్రోలినాను.

మరునాటి ఉదయం.

ఆకలకలమేంటి? పోలీసువాళ్లు నన్నుపట్టుకోడానికి వచ్చారు. చయనులు మరణించారట. ఏపాపమెరుగని నన్నుపట్టుకొని జెయిలులో వేశారు. సాక్ష్యము ప్రబలం. నాకు ద్వీపాంతరవాసంవేశారు. అయ్యో! నా ఆలుబిడ్డలేమయ్యారో. వాళ్ళగతి యేమవుతుందో ఈ దుఃఖంతప్ప మరేమీలేదు నాకు. ధర్మం మొహంమండింది. నా అధోగతికి కారణము. అంటూ నాగయ్య మూర్ఛపొయ్యాడు.

పై విధముగా నేను మొన్న మదరాసు జెయిలును చూడడానికిపోతే ఓ శల్యావశిష్టుడైన మనిషి చెప్పగావిన్నాను,

ఇంతకూ యిది నిజమేనా? ధర్మానికి అసలు ప్రదేశమే లేదా? అనుకొంటూ నేను జెయిలునుంచి పైకివచ్చాను. ఇది నిజముగా సంభవమేనా? మీరు చెప్పండి.

# కొన్ని ఘోషలు.



౧

'సార్! సార్!' ఎట్రిప్రెకిలు టెలిగ్రాం జవాను శివయ్య ఇంటిముందర కేకలిడుతున్నాడు, లోపల అంతఃపురంలో భార్యతో నానా అంటూన్న శివయ్య హడలెత్తి బైటికివచ్చాడు. పాపం! అంతకు ముందటిరోజే కూతురికి అపాయకరమైన జబ్బు వచ్చి అవస్థపడుతూఉందని వినియుండడంవల్ల.

టెలిగ్రాం పుచ్చుకోండిసార్! ఇంతసేపు నిలబెట్టారుకదా!

కోప్పడాకునాయనా! లోపల ఎక్కడనో ఉన్నాను. ఎలాగూ అద్దెకొంపలు సారంగంమాదిరిగా ఉన్నాయ్.

టెలిగ్రాంను విప్పిచూచాడు పాపం సందేహిస్తూ సందేహిస్తూ.

చేతులవణకుతో ఒడలు జలబరించింది. చేతులార పెంచిన ముద్దుకూతురు. ఏమైందో అని.

ఆఖరికి ఎలాఅయితేనేం విప్పిచూచాడు.

ఉండేభయం, విషాదం అంతా నిమిషంలో భీభత్సమైపోయింది.

ఆః! ఏమిా! వీడిపొగురు. మొన్న పోయేటప్పుడు నూరు రూపాయలు ఎత్తుకెళ్ళాడు. అప్పుడు ఈ వ్రాతకూడానా.

Pockets empty wire fifty వీడి మొహానికి Poetry కూడాను! అంటూ రుసరుసలాడుతూ పోతాడు లోపలికి తంతితీసుకొని.

ఏమేయ్! చూచావా! మీవాడు అప్పుడే తంతికొట్టాడు దొర! 'జోబీ కాళీ, యూభైపంపు' అని. మొన్న నీయెదుటనే వాడికి నూరురూపాయీలు ఇచ్చాకదా! అపుడే ఏం అంత అపసరం ముంచుకొచ్చింది. కారణమైన తెలుపకుండా 50 పంపమంటే కలువుకాలం ఎలాపంపేది. పంపకపోతే ఏంతిట్టుకొంటాడో! కమలం ఎలాఉందో తెలియదని నానాఅవస్థ పడుతూఉంటే ఈయనకు షోకుగా జరగడానికి ఇంకొక యాభై పంపించాలి! ఏం చదువబ్బా ఇది!

కారణంలేకుండా అలారాస్తాడా! ఏదో ముంచుకరాకపోతే ఆవిధంగా ఎందుకు తంతికొడ్తాడు!

పోయిననెల నూరురూపాయీలు పంపిస్తే అవతలకూడా 30 రూపాయీలు కావాలని తంతికొట్టాడుకదా! దానికి ఏమాత్రం విమర్శ రాయలేదు. ఈసారి నేనుపంపను.

ఇలా గోలగావుంది వాళ్ళిద్దరికీ!

౨

## ఇంకో వీధిలో.

నరసయ్య తాలూకా శిరస్తదారు. గుణవంతుడు. మంచితనమునకు చాలా పేరుపొందాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు లేకలేక ఒక కుమార్తె.

తంటాలుపడి పెండ్లిచేశాడు ఆమెకు ఒక కులీన వరుణ్ణి వెదకి. అప్పటినుంచీ ప్రారంభం.

అపుడే ఆఫీసుకి పోవడానికిసిద్ధంగా అబ్బాసలీకాలంనాటి తెల్లకోటు జరీ తలగుడ్డ కట్టుకొనిబయలుదేరుతున్నారు.

టక్! టక్! టెలిగ్రాం వచ్చింది.

(Pockets empty wire fifty. Neel Ratan.)

అబ్బా! వీడితో నేను బాధపడలేక పోతున్నాను. వచ్చే జీతం నూరు రూపాయలు. దాంట్లో యాభై రూపాయలు పంపిస్తే మనమేంకాను?

వెంకట్రావుకి జీతం 6 రూపాయలు కట్టవాలి. కర్మం చాలకో టాలాటకోలిగాతిరిగో ఇంతకుముందు అయిమంబావలా కష్టంటే ఇవుడు నాకు తోడుగా ఇంకాకొంచెం జాస్తి అయ్యేట్టు చేశాడు. రాముడు మద్రాసులో ఉన్నాడు. వాడికి పంపించడానికి ఎట్టని ఏగానిఅయినా లేదు. పాపం! గిర్కురు మనకుండా చప్పగా కూర్చున్నాడు. అయినా సామర్థ్యంకలవాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే......అనుకొంటూ ఆఫీసుకు పోతారు.

సాయంత్రం అకౌంటుచెకింగు. పగాకుగా దినంపొడుగూతా అల్లుడిగారి డిమాండు ఎలాతీర్చడం అని లెక్కిస్తూ కూర్చోడంచేత కొన్ని తప్పులయ్యాయి. షరాఫ్కు విషయం తెలుసుకాబట్టి హెచ్చరిస్తాడు.

సాయంత్రం అయింది. ఉత్సాహంలేదు మొగంలో.

ఒసేయ్! అల్లుడు తంతికొట్టాడే! యాభై రూపాయలు పంపాలట!

తిరుగా మొదలెట్టాడూ! పంపకపోతే పిల్లదాని ఉసురు పోసుకుంటాడు! మీారు చేశారే వెదకి వెదకి. దరిద్రపుసంబంధం. పెద్దవాళ్ళయింటి సంబంధం ఈవిధంగా తెల్లవారింది.

బాగాఉందేయ్! నేను అందుకే మాచెల్లెలి కొడుకు ఉన్నాడు. స్కూల్ ఫైనల్ చదవకపోయినా ఏదో 14 ఎకరాలు ఆస్తి ఉంది. కమలాన్ని ఇచ్చి పెండ్లి చేద్దాంఅంటే ఒప్పుకొన్నావ్? కాలుకుంటి. కుంటిసన్యాసికి పిల్లనిచ్చి గొంతుకోస్తారా అన్నది నీవేకదూ!

ఎప్పుడూఇంతే. నేను వద్దన్నానా! వాడుమాత్రం అల్లుడైన తరువాత ఇంతేచేయడూ!

అయితే ఎలాగ ఇప్పుడూ!

అదేంటండీ! నన్నడుతారు!

ఒకమాట చెబుతావిను! నీ నాగరం ఈ. కుదువబెట్టి డబ్బు పంపిద్దాం. అవతల నెలజీతం వచ్చినప్పుడు చూద్దాం!

నాకేవచ్చింది.........

మరీ ఆగోల చెప్పతరంకాదు.

3

శ్రీరాములుచెట్టి యాభై ఏండ్లవాడు. ఇప్పటికి ఇద్దరు పెండ్లాలయ్యారు. మూడవ ఆమె కావలెనని ముచ్చటగా నల్లని

రుబ్బుడుపత్రం కోటీరత్నాన్ని ఇరువై అయిదేండ్లదానిని పెండ్లాడా డు. ఇకనీ గీచినగీటు దాటనన్నట్లుగా ఆమె చెప్పిందే వేదవాక్యం గా నడుస్తూ ఉన్నాడు. ఇంకేం! ఆమెకీ ఆమెచెల్లెండ్రికీ తమ్ము ళ్ళకి నాయనకి అమ్మకూ అందఱికీ జయప్రదంగా సాగుతూ ఉంది.

ఆదినం అపుడే ఆరవేసిన కొల్లాయిగుడ్డ కట్టుకొని ఏమే రత్నం! అంటూ స్నానం చేయడానికి పోతూపోతూ 'నోరు నొవ్వంగ' చెబుతూ నీళ్ళచెంబు తీసుకోతాడు. ఇంతలో కెవ్వున కేక వినవస్తుంది. ఉలిక్కిపడ్డాడు.

తన ఇంట్లో బైటాయించిన మఱిది ఆవిడ స్నానానికని వచ్చిఉండి నిలుచుకొన్నప్పుడు తాను వచ్చిందానికి అది సూచ నఅయింది.

ఇంకేమి! వాక్ఝరి ప్రవహిస్తుంది.

శ్రీరాములు వెనక్కిపోతాడు.

భార్యకు క్షమాపణలు చెప్పుకుంటూ లోపలినుండి వెలి కి అవస్థపడుతూ వస్తాడు.

పోస్టుమర్ ఆంజనేయులు తన బొద్దుమీసాల్ని సవరించు కొంటూ తొలకరి నవ్వులతో వస్తూఉంటాడు.

ఉత్తరం ఏమైనావుందా ఆంజనేయులూ!

ఆఁ! అంటూ శెట్టిచేతికి జాబునిస్తాడు. జాబు తీసికొని ఇది శ్రీముఖం కాబోలు! ఆఁ! ఏమి! బ్రాడ్వే! సరే బావమఱిది

కామోసు! తిరుగాడబ్బుకు వ్రాస్తూన్నాడు. ఇదేంకర్మం అబ్బా అనుకొంటాడు. లోపలికిపోతాడు. ఆకటికచీకటిలో భార్యకోసరం వెదకులాడుతూ వంటయింటి ప్రొయ్యికాంతిలో ఆమెను గుర్తిస్తాడు.

ఓ బంగారూ! మీ తమ్ముడు జాబు వ్రాశాడేయ్! డబ్బు పంపించమని. ఎలాపంపడం. కసాలాగాఉందే!

పాపం! వాడు అవస్థపడుతూంటే ఈవిధంగా అంటారూ! పంపితేఏం?

అదికాదే! వ్యాపారం చేసేవాళ్ళకి ఈ విధంగా దుబారు ఖర్చు చేయడంఅవుతే ఎలాగా!

పంపితే పంపవలసిందేకాని ఊరికేవ్యాఖ్యానాలెందుకూ? మీ రివ్వకపోతే మా నాయన పంపిస్తారులెండి! వాళ్ళేం మీ కూలివాండ్లా ఆవిధంగా ఉండడానికి!

అదికాదే ఆవిధంగా అనుకొంటే ఎట్లా! సమాచారం చెప్పాను అంతేకాని మీ వాళ్ళను నేను ఏమీ అనలే! దేనికింత కోపం!

తిరుగా అలా అంటూన్నారే! నేను కోపిష్టిదాన్ని మీరు సాధువులూనా! ఆఁ! అంటూ రాగాలెత్తుతుంది.

ఇక శ్రీరాములు శెట్టిని అలాగేవదులుదాం. తనభార్యను అనునయించే ప్రయత్నం ముందటి భగీరథప్రయత్నం కొంతమాలిందై పోయింది-

౪

## వీ ధి లో .

ఒకరయాము. బ్రహ్మచారి బృందాలు పురసంచారాలవల్ల సమాచారాలని గ్రహిస్తారు.

ఒరేయ్! మనకి పెండ్లి వద్దురా! అది బలేతగులాటం అవుతుంది!

నీవు వద్దంటే సరిపోతుందటరా! మీానాయన రేపు మార్కెటు వాల్యూకి అమ్మేయడటోయ్?

అవంతా ఇపుడెందుకురా; నందో రాజా భవిష్యతి. మనం రాబొయ్యేదాన్నిగురించి ఎందుకు అనుకోడం; Make hay while the Sun shines!

ఇపుడు బాగా జమాయించవోయ్;

అవతల సమాచారం చూచుకొందాం;



# 'అంతర్వ్యాహిని లేక మాగుల్జుం'

(ఏకాంకనాటకము)

[ఉపోద్ఘాతం:

యూరోప్‌లోనే రాజ్యతంత్రాలు లోపలలోపల కుట్రలు, గలభాలు, జరుగుతూ ఉంటాయని, జరుగుచున్నాయని ప్రతీతికదా! అయితే అంతకన్నా అతీతంగా మనదేశంలోనే అందులో మనస్కూలు ప్రపంచంలోనే చాలాచాలా తుపానులు రేగుతుంటాయ్! ఎన్నో అంతర్వ్యాహినులు ప్రవహిస్తుంటాయ్!

Diplomacy ని చూపిస్తూ ఇతరులగోల మూలంగా పైకిరావడం మనకు స్ఫుటంగా తెలుస్తుంది పీనిని పరిశీలించినట్లయితే! Superiority complex మొదలైనవాటి పూర్తివిజృంభణాన్ని మనం చూడగలుగుతాం. Seniority, Juniority పరాభివృద్ధి దుస్సహనము, స్వార్థప్రియత్వము, పతనభయము ఇలాంటివి Full play లో ఉంటాయ్.

అందుమూలముగా సి. పి., బెంగాల్., సింధు; క్యాబినెట్టుక్రైసెస్‌లను మఱపించే సంఘటనలు కలుగుతుంటాయ్. దీనికి దృష్టాంతరంగా స్కూలుప్రపంచంలో 'టైంటేబిల్ క్రైసిస్' కాకపోతే Distribution of work విషయమై మిక్కిలి క్లిష్టపరిస్థితులు కలగడం అనేదిఉంది.

ఇది చూపఱులకందరికీ తెలియడం కష్టం. బాగాపరిశోధ నచేస్తే స్కూలు ప్రపంచంలో ఇలాంటి పరిస్థితులు సంభవించ డం అరుదుకాదని మనకు తెలుస్తుంది.

ప్రతిస్కూలులోను మన రొట్టెకొట్టుచర్లవలె టైంటేబి ల్ మేకర్సు కొందఱు ఉంటూంటారు. వాళ్ళది అది ఒక Spe-ciality కాల క్రమేణా అది ఒక Vested interest అయి కూర్చొంటూఉంది. వాళ్ళవాళ్ళ ప్రియులైనవాళ్ళకి తగినట్లుగా 'టైంటేబిల్'ను తయారుచేయడం కనబడుతోంది. దీనిని మొద ట్లోనే అరికట్టకుండా అలాగే ఉంచినట్లయితే కాలక్రమేణా దానిని అణగద్రొక్కడానికి వీలులేకుండాపోతుంది.

పాఠశాల అధికారి అయినఆయన ఈ Distribution సరిగా చేయకపోతే-అంటే Efficiency ప్రవేశం అలాగే Seniority of service ను పట్టి ఎవరినైనా పైకి వేయకపోతే అందువల్ల అనర్థమే కలుగుతుంది. దీనిని ఆధారంగా ఈ క్రింది కథ వ్రాయదలచాను.

ఇందలి పాత్రలల్లా కల్పితాలు. అట్లనికాక గుమ్మడి కాయదొంగ భుజాలు తడుముకొన్నట్లు Tickle అయితే నా జవాబుదారిలేదు.]

—:పాత్రలు:—

నడిఏటి రామారావు:—స్కూలుమేనేజరు

ప్రిన్సిపాలు

హెడ్మాస్టరు

| | |
|---|---|
| నరహరిరావు<br>సీనయ్య<br>జండా సుబ్బరామయ్య<br>కృష్ణశర్మ | ఉపాధ్యాయులు. |

అప్పయ్య:—మేనేజరుబంధువు, ఉపాధ్యాయుడు, రైటర్

ప్యూన్:—వెంకడు

1వ రంగము.

[హెడ్మాస్టరుగారియిల్లు అప్పుడు దాదాపు 7-30 గంటల ఉదయం. హెడ్మాస్టరుగారు ఈజీచెయిరులో పండుకొని న్యూస్ పేపరు చదువుతూంటారు. దూరంగా ఒక చాపపైన రైటరు చెంగయ్య కూర్చొని ఏమీా తెమలని రికార్డ్లనిచూస్తూ ఉంటాడు.]

హె:- చూచావా చెంగయ్యా! సీనయ్యవాళ్ళకి తమచేతనే టైంటేబిలు వేయడం సరిగా వీలవుతుందనీ మిగతావాళ్ళ ఎవరిచేతకూడారాదనీ అభిప్రాయమటనే!

చెం.- ఏంలేదుసార్! నాలుగు సంవత్సరాలుగా వారు వేస్తూఉండడంబట్టి కొంచెం అలా ఉంటున్నారు.

హే.- అయితే ఈసారి నేను వేస్తాచూడు. అపుడు తోవకి వస్తారనుకొంటూ. ఒరేయ్! వెంకడూ!

వెం.- స్వామీ!

హే.- పోయి జండా సుబ్బరామయ్యగారిని పిలుచుకొనిరా!

(వెంకడు నిష్క్రమించును)

(రైటరుతో) డ్రాయింగ్ టీచరు తనకు చాలా పీరీడ్లు ఉండంటున్నాడు. ఎలాదీనిని సరిచేయడమో తెలియడంలేదు.

రై:- అదేంసార్! జాగ్రఫీ టీచరుకు రెండు డ్రాయింగ్ క్లాసులుఇస్తే సరిపోతుంది. ఇంతకూ దానికి ఏమీ 'వాల్యూ' లేదుకదా!

హే:- సరే! చూద్దాము.

(ఇంతలో జండా సుబ్బరామయ్యగారు వచ్చెదరు.)

సు:- Good morning sir! ఎందుకు పిలువనంపినారట!

హే:- ఈసారి 'టైంటేబిలు' ను నేనే సరిచేసూ ఉన్నాను. మీకున్నూ కోణగిరి కృష్ణశర్మకున్నూ స్కూల్ఫైనల్ క్లాసులు ఇవ్వదలచుకొన్నాను. మీకు ఇష్టమేనా?

సు:- పై క్లాసుకు చెప్పమంటే వద్దంటాఊరూ సార్! చూడండి దయఉంచండి.

హె:- సరే! ఈ రోజే నేను ప్రిన్సుపాల్ గారితో చెప్పి మీకు పై క్లాసులో 4 పీరీడ్లు చరిత్రనూ, శర్మకు ఇంగ్లీషును ఇప్పిస్తామనుకొంటూ ఉన్నా. అయితే శర్మ సహాయంతో టైం టేబిల్ అరేంజి చేస్తాను.

సు:- అలాగేనండి, మీ యిష్టం. మరి నేను వస్తు న్నాను. (పోవును)

హె:- (రైటరుతో) చెంగయ్యా! చూచావా ఈయన కు ఎంత అణకువో! చాల బాగ చెప్తాడని మా అబ్బాయి చెప్ప గావిన్నాను. నిజంగా వీరిద్దరికీ స్కూల్ ఫైనల్ క్లాసులో చెరీ నాలుగు పీరీడ్లు ఇప్పించ్యడం మంచిదనుకొంటాను.

రై ;- మీ Internal administration, Distribution of work మీ ఇష్టప్రకారం చేయవచ్చు కదండీ సార్! ప్రిన్సిపాల్ను, మేనేజర్ను అడగడం ఎందుకూ?

హె:- అలాకాదోయ్! ఎటుపోయి ఎటువచ్చినా వాళ్ళతో చెప్పిచేయడం మంచిది. నడిమేటి రామారావుగారు నామాట ఎందుకు తోసివేస్తారు! వెంకణ్ణి శర్మనుపిలుచుకో రమ్మని పంపించును.

రై :- అలాగేసార్! (తెరవాలును)

రంగము 2.

(జండా సుబ్బరామయ్యగారి గృహము. కృష్ణశర్మగారు షోకుగా ఊగులాడుతూ వస్తారు.)

సుబ్బ:- కూర్చోవయ్యా! పంతులూ! ఏం విశేషాలు? పూర్తి అయిందా టైంటేబిలు?

కృష్ణ:- ఆఁ! ఒక విధంగా పూర్తిఅయింది. అబ్బ! ఏం గొడవ! అప్పుడే సీనయ్యవాళ్ళకి Wireless అందిపోయింది! బలేగడబిడ చేస్తూన్నారువాళ్ళు. టైంటేబిలుపైన సహాస్రంగా కాగాలునూరబోతారువాళ్ళు.

సు:- అపుడే ఇద్దరు స్టూడెంట్లుకూడా వచ్చారు. 'సార్! మా క్లాసుకు మిమ్మల్ని వేస్తారటనే! మీసెక్షనుకు మార్పించండి సార్! అన్నారు. ఒరేయ్! మాకన్న ముందుగా మీకెట్లు తెలుసురా?' అంటే 'సార్! అపుడే చాలా రూమర్‌గా ఉంది.' అన్నారు. ఈ Leakage ఎలా అయింది?

కృష్ణ:- నరహరిరావుకు నాపై కంటుఉంది. నేను జూనియర్‌ని పైకివస్తే ఆయనపేరుకు ఎక్కడ లోటువస్తుందో అని భయపడ్తూ ఉంటాడు.

సు:- ఆయన సీనియర్ అయితేమట్టుకు జూనియర్ పైకిరావడం ఎందుకు ఒప్పుకోకూడదు?

కృష్ణ:- ఆయన ఇంగ్లీషు చెబుతూంటే ఎవరికీ అర్థం కానట్లు చెబుతూంటారట. పిల్లకాయలు గోలపెడ్తూ ఉన్నాం 'మీరురాండిసార్! మీరురాండిసార్!' అంటూన్నారు. ఎలాగూ ఎంత సీనియర్‌అయినా Out side activities ప్రబలినాయి కదా ఆయనకు. అంచేత పాఠాలు తూగుతూ చెబుతున్నారని

విన్నాను. ఇందువలన నేను పైకివస్తే ఆయనసెక్షనుకి పిల్లకా యలు సరిగాపోరు అని ఆయనభయం.

సుబ్బ:- బాగాఉందండీ! మనంకోరకుండానే హెడ్మాస్టరు గారు మనకి పై క్లాసులని ఇస్తారనగా ఏమోమంచిది అని సంక లుగుద్దుకున్నాను. ఇదేంది ఈహాలాహలం?

కృష్ణ:- ఏందండి సత్యకాలపు మనుష్యులవలెనున్నారు మీరు! టైంటేబిలు వాళ్ళకి పంపిస్తే సీనయ్యకు నరహరిరావుకు మూరాబారెడు కోపంరాబోతుంది చూడండి. నేను చెప్పేవి అబద్ధాలుకావు. ఇప్పుడే అప్పయ్య నాతో చెప్పిపొయ్యాడు.

సుబ్బ:- సరే! చూద్దాం! ఎలాగూ రసాభాసంపడకుండా గడిస్తేచాలు. ఒక నాలుగుపిరీడ్లుకోసరం ప్రాకులాడితే మనమేం చేదాం!

కృష్ణ:- అదుగోనండోయ్! వెంకడెందుకో ఇలా వస్తూ న్నాడు. (వెంకడు ప్రవేసించును)

వెం:- దండంస్వామీ! ఇదుగో టైంటేబిలు.

(సుబ్బరామయ్య టైంటేబిలును ఆదుర్దాతో చూచును తనకు 4 పీరీడ్లు చరిత్ర స్కూల్ఫైనల్ క్లాసుకు వేయడమున్నూ, అప్పయ్యకి జాగ్రఫి స్కూల్ఫైనల్కున్నూ, చరిత్ర నాల్గోఫా రానికున్నూ వేయబడివుండడం చూస్తాడు.)

సు:- ఏమండోయ్! నాకు ఈ 4 పీరీడ్లు వుంటాయని న మ్మకంలేదు. సరేచూద్దాం!

కృష్ణ:- వస్తానండి. (పోవును)

(తెరవ్రాలును)

## 8-వ రంగము.

[నరహరిరావు చొక్కా వేసుకొంటూ ఆలోచిస్తున్నాడు. ఇటు అటు నడయాడుతూ ఉంటారు తమయింటిలో]

నర:- ఈశర్మని పైకివేస్తే నాకుఉండే ప్రతిష్ట పోతుంది. అయినాకాని Senior ను నేనుఉంటే క్లాసులన్ని స్కూల్ ఫైనల్వి నాకివ్వకుండా ఎప్పుడూ ఫోర్తుఫారానికి చెప్పేవాణ్ణి నాకు సమానంగా చేయడానికి సాహసించాడే ఈహెడ్మాస్టరు! అబ్బా! అవమానంగాఉందే. క్రొత్తవాడవిశర్మ సెక్షనుకే స్టూడెంటులందరూపోతే నేనేంచేసేది? క్రొత్తరుచికదా ఎప్పుడూ! వీణ్ణి ఎలాగయినా అణగద్రొక్కాలి.

(ఇంతలో సీనయ్య రుసరుసలాడుతూ రూక్షవీక్షణాలతో
చిందులుతొక్కుతూ వస్తాడు.)

నర:-(తనలో) సరే! వీణ్ణి కదిలిద్దాం. ఒక పెటిషన్ మ్యానేజరుకు గోకిస్తాం, అవతల ఆయనను Screw తిప్పితే సరిపోతుంది. [పైకి] రావోయ్! కూచో! ఏం అలాఉన్నావు?

సీనయ్య:-చూచారా! నాకు ఫోర్తుఫారంమాత్రం ఇంగ్లీషుఇచ్చి, ఫిప్తుఫారంఅయినా ఇవ్వకుండాచేశాడు యీ హెడ్మాస్టరు! మనపైన Grudge ఉన్నా ఇలాచేస్తేఎట్లా?

నరహరి:- [తనలో] నీతెలివికి అదిచాలదూ! [పైకి] సరే! ఊరికే కోపపడితే ఏంలాభంఉంది? నాకుకూడా అదే విధముగా చేశాడు, ఇంగ్లీషు స్కూల్ ఫైనల్కు టీచ్ చేయడానికి

శర్మకేంవచ్చు? Experienceనాకుఉండగా నాకుకాదని శర్మకు ఏవిధంగా ఆక్లాసుయిస్తారు? అన్యాయంకదూ?

సీన:- [తనలో] నీవుచెప్పేవిధం నాకు తెలియునూ! ఏదో భంగిభాయిలా వుండేవాడివి. [వెలికి] నిజంగా! దీనికి ఏదైనా ఉపాయుందొరికితే చేయూల. రేపటికి ఇది అవలంబించాలకదా.

నర:- నేను ఓఆలోచన చెప్తావుండు నీవు మేనేజరుకు ఓ అర్జీపెట్టు. మాకు హెడ్మాస్టరు చాలా అన్యాయంచేశాడు, సీని యర్లముగా మేమువుంటే మాకుకాదని వెనకవచ్చినవాళ్ళకి పై క్లాసులివ్వడం సరికాదుఅని. అవతలచూద్దాం.

సీన:- అవును. ఇది మంచి ఉపాయమే. Eurekha! I have got it! (వెళ్ళును)

నర:- కార్యసాధనంలో ఒకసోపానంకట్టాను. ఇంక అప్ప య్యకు పురిఎక్కించాలి.

(ఆ సమయానికి సరిగా అప్పయ్య పరుసములాడుతూ వస్తాడు.)!

నర:- [తనలో] ఆడబోయినతీర్థం ఎదురైంది. సరే [పైకి] రండి, అప్పయ్యగారూ! కూచోండి. మామగారు బాగున్నారా!

అప్ప:- ఆఁ! విన్నారా! సుబ్బరామయ్యకు స్కూల్ఫైన ల్ క్లాసు నాలుగు పీరీడ్లు ఇచ్చారట! అదేంటండీ! మనమంతా ఉండగా!

నర:- (తనలో) వీడికి కృష్ణశర్మ చాలా స్నేహితుడు.

కొంచెంతాజాచేసి సున్నితంగా మెలగాలి. (పైకి) మరేనండి ఏంచెబితే ఏంఉపయోగం? మీ మామగారు మేనేజర్ సంబంధీకులు అని తెలిసీకూడా మీకు అవమానం చేయడానికి సాహసించారు కదా!

అ:- అదే ఆశ్చర్యంగాఉంది. ఈసారి రాజీనామాకు Force చేయిస్తాను హెడ్మాస్టరుని. ఈవేళ మామామతో చెప్తాను.

నర:- [తనలో] శివమాడుతూన్నాడు. ఇపుడే తగినసమయం. సుబ్బరామయ్య ఎలాపోయినా అవసరంలేదు. శర్మ గోతా కొట్టాలి. అతన్ని తీసివేస్తే ఎలాగూ సుబ్బరామయ్యకు క్లాసులు తీసివేస్తారు. చూస్తాం. (వెలికి] అప్పయ్యగారూ! అదికాదు మీరు చేయవలసింది. మేనేజరుకు ఓ ఉత్తరంవ్రాయండి Personal prejudice పైన హెడ్మాస్టరు మాకు కావలెనని అవమానం చేశారు అని. అపుడు బాగుంటుంది.

అప్పు:- (తనలో) అయితే ఈవిధంగాచేస్తే కృష్ణశర్మకి బొత్తుగా లేకుండాపోతుందే. సరే! తన్నుమాలినధర్మం మనకెందుకూ! నాసమాచారం మొదటచూచుకొంటేచాలు. (పైకి) మీరుచెప్పింది నాకు బాగానచ్చిందండి! ఆవిధంగానేచేస్తాను. వస్తాను. [వెళ్ళును]

నర:- బళిరా! పాచికపాటింది. నేను అనుకొన్నకార్యం జయమౌతుంది. ఇక నేను శర్మకుభయపడవలసిన అవసరంలేదు.

["వంకాయల సుబ్బరాయుడ ఇంకేమి కావలెనురా!" అంటూపాడుతూ నిష్క్రమించును.]

4-వ రంగము

(హెడ్మాస్టరురూము. స్కూలులో. సాయంత్రం 4-30 గంటలు కుర్చీలో కూర్చొని గొణుగుచుండును.)

హె:- అబ్బ! అబ్బ! ఏంచెంబెంబీలు ఇదీ! అందఱూ సుబ్బరామయ్యకు శర్మకు స్కూలుఫైనలు క్లాసును ఇచ్చిందానికి పిటీషన్లు పెట్టారట అప్పయ్య వాళ్ళ మామ ఆదరువు చూచుకొని కోంపముంచుతాడు కావలె. ఏమీ ఉపయోగంలేని సీనయ్య నేను సీనియారిటీ Follow చేయలేదని అర్జీపెట్టాడట. ఇవన్నీ ఇలాఉంటే శివయ్య 'జాగ్రఫీగాణ్ణి నన్ను డ్రాయింగుకు వేశారే' అంటూ గోలపెడుతూన్నాడు. దీనికి ఉపాయంవుంది కాని సీనయ్య అప్పయ్యలవిషయం ఎలాగా?

(అపుడు కృష్ణశర్మ అచటికివస్తాడు)

కృష్ణ:- (తనలో) పాపం; అప్పయ్యకి కొంచెంసహాయం చేస్తాను. [హెడ్మాస్టరుతో] సార్! ఒకేమాటవినండి. మేనేజరు దగ్గఱ అప్పయ్యకు పలుకుబడివుంది. అప్పయ్య, 'సుబ్బరామయ్యకు 4 పీరీడ్లున్నా నాకుమాత్రం స్కూల్ఫైనలు హిస్టరీ 2 పీరీడ్లునా?,' అంటూ గలభాచేస్తున్నాడండీ. అతనికి ఇంకో రెండు పీరీడ్లుస్కూలుఫైనలువిచ్చి సుబ్బరామయ్యకు 2 S. S. L. C. పీరీడ్లున్నా మిగతారెండూ V th. ఫారంలోఇస్తే సరిపోతుంది.

(సుబ్బరామయ్య అక్కడికి మెల్లగావచ్చును. అతనికి ఈ కడపటిమాటలు వినబడుతుంది.]

సుబ్బ:. అక్కఱలేదండీ! ఎందుకు వృథాగా పెద్దవాళ్ళతో మనం ఢీకొనడం? ఆరెండుపీరీడ్లుకూడా ఆయనకేసర్దండి. హాయిగా ఐదవఫారంఉంటేచాలు మాకేం పరువు తగ్గిపోదు. త్వరగా ఆవిధంగాచేయండి.

కృష్ణ:- ఎందుకండీ సుబ్బరామయ్యగారూ! అలాచెప్తారు! మీకు 2 పీరీడ్లు ఆయనకు 2 పీరీడ్లు వస్తవికదా?

సుబ్బ:- సగంసాగినతలకు ఎవరైనా ఒప్పుకొంటారా? చెప్పండి.

హె.- మీరుపొండి. ఇపుడు మేనేజరువారువస్తారు. ఆయనతో నాకు మాట్లాడవలసిఉంది, కాకపోతే రాజీనామా ఇస్తాను.

సుబ్బ; కృష్ణ:-Good evening, పోయివస్తాము. (వెళ్ళెదరు)
[ఇంతలో నడిమేటి రామారావుగారున్ను (మేనేజరు) ప్రిన్సిపాల్ గారున్ను అక్కడికివస్తారు. హెడ్మాస్టరులేచి వారిని కుర్చీలలో ఆసీనులనుగా చేయును.]

మే.- ఏమండీ టైంటేబిలు సరిగాలేదని బోలెడు పెటిషన్లు వచ్చిఉన్నవి. సీనియారిటీ చూడలేదటగా!

ప్రి:- అది విచిత్రంగాఉంది.

హె:- అదేందండి! మీతో చెప్పానుకదా! సుబ్బరామయ్యని కృష్ణశర్మని ఇద్దరినీ స్కూల్ ఫయినల్కు వేస్తానని. వాళ్ళ Etfficiency కి లోపంలేదుకదా! సెక్షన్సు జాస్తిఅయ్యాయని

సీనియరువారికి కష్టంగాఉంటుందని వీళ్ళని Help కు వేశాను. మీరు ఒప్పుకొన్నదేకదా!

మే:- సరేనండి. అయినాకూడా సీనియారిటీ రూల్సు Strict గా పాటింపవలసినవికదూ!

ప్రి:- Yes. అలాగా ఉండాలి.

హె.- (తనలో) ఈయన అయనకి Parrot. తన Posi-ion సెక్యూర్ గా ఉండాలని ఆయన 'తోకవెంబడి నారాయణ' అయి ఉన్నాడు (పైకి) అయితే మీరుకూడా ఒప్పుకొన్నారు కదండీ!

మే:-(తనలో) కొంచెం బెట్టుగా మాట్లాడాలి. Internal adjustmentలో మనకు జోక్యం ఉండకూడదనిఉన్నా ఈయన్ని గుబ్బించేదాం (వెలికి) మొదట ఆవిధంగా అనుకొన్నాం. ఇంత అవస్థపడుతుందని ఎవరనుకొన్నారు?

ప్రి:-అవునండీ! Future ను గురించి చెప్పడానికి ఎవరికి వీలవుతుంది?

హె:- ఇద్దరూ ఒకటయ్యారు. మనంతో కాడిస్తే మొదలుకి మోసంవస్తుంది. ఎవరుపోతేమనకేం? అయినాకొంచెం బిగింపుచూపిద్దాం (పైకి) అదేంటండీ మీ Consent తో చేసిందానికి నన్నింత తర్జనభర్జన చేస్తున్నారే! నన్నిలాచేస్తే నేను నాపని వదిలిపెడుతున్నాను.

మే:-(తనలో) ఒరే!ఒరే! చాలాచిక్కొచ్చిందే! (ప్రిన్సి

పాలుతో అంతరికంగా) కొంచెం Coax చేస్తూ. మీరుదానికి ప్రసిద్ధికదా!

ప్రి:- (Blushing Unseen by the headmaster) తమదయ. (పైకి) హెడ్మాస్టరుగారూ! ఎందుకింత వృధాసోష! ఆ విధంగాచేస్తే మనసమాచారం రచ్చకెక్కుతుంది. సర్దుకోండి నేను చెప్తావినండి. నరహరిరావు ఒకవుపాయంచెప్పాడు. అలాచేస్తే అంతాతీరుతుంది. 4 పీరీడ్లు ఇంగ్లీషు శర్మనుంచితీసి నరహరిరావుకిచ్చి 4 పీరీడ్లు హిస్టరి సుబ్బావధాన్లకిఇస్తాం. ఏమీతంటా లేకుండా పోతుంది.

మే:-అలాచేయండి. బాగుంటుంది-

హెడ్మా:- (తనలో) సీనయ్య వీళ్ళంతామూలబడ్డారు- ఇక జయమే. (పయికి) మీఇష్టం, (వెళ్ళిపోతారు అందరూ.)

తదుపరి ఈవృత్తాంతం ఉపాధ్యాయ బృందానికి తెలిసింది. ఒకరిని చెఱుపబోయిందాని కిదీఫలం అని అప్పయ్య, ,,ఆఖరుకు మాహెడ్మాష్టరు ఆచారిగుజ్జం లక్ లక్ అయ్యాడు'' అని మిగతావారూ, 'శెబాష్! చాణుక్యుణ్ణి మించానని' నరహరిరావూ అందఱూ పలువిధాలా అనుకొంటారు.



# ఏ. సీ. వాలకం

పై శీర్షికనుచూచి అట్టే నిర్ఘాంతపడబోకండి.

ఇది వ్యక్తివిమర్శకాదు. పరామర్శ అంతకన్న కాదు.

ఏ. సీ. అంటే క్రీస్తు తదుపరి అన్నమాట. ఇందులో కూడా క్రీస్తుఅంటూ వేమయ్యా అంటూరా. వాడెవరో అన్నట్లు కాంట్ హెల్ప్, ఉగ్గుపాలతో పుట్టిందిమాకు. కాస్టర్ ఆయిల్ అంటే అసహ్యం. కాస్టోవీన్ అని ఆ అయిల్ తోనే చక్కెర చేర్చి కల్పివాసన పోగొడ్తే ఒరే! ఒరే! అంటూ లొట్టలువేసుకొంటూ మిర్రింగడము ఫలితము నున్నఅయినా. అప్పటముగా మావిషయముమాకు అవసరములా. కాస్మోపాలిటన్ గా అంటే హంసక్షీరన్యాయములో అన్నింటిలోవుండే సుగుణాలను మిళావ్ చేసి మెలగుతాం మేముఅంటూ ఏ. సి. కళాభాయాలుదచ్చీలు కొడ్తారు. కాబట్టి భాషయొక్క ఉపయోగము మన అభిప్రాయాలను తెలపడముకదూ! అందువల్ల తగినట్టుగా చరించాలసింది అని. దానికోసరము యేమి ఉపయోగించినా ఫరవాలేదని.

అలా అయితే ఇంగ్లీషుతో చేర్చి యెందుకుమాట్లాడాలి అంటూరా, ఇది ఏ. సీ. వాలకము! ఏం! భాయీ! కాస్తోకూస్తో మనభాషని మాట్లాడకూడదూ! అంటేనా ఈ సందర్భాల్లో మనలాంగ్వేజి మాట్లాడము బి. సీ. ఓయ్! అలవాటులేదు మనకి యేంచేద్దాం అని బదులు వస్తుంది.

ఇలా ఉన్నా హిందీవస్తే దుంపతెగుతుంది. చచ్చాము నాయనా! ఆ! ఆ! ఎంతద్రోహము. మాతృద్రోహము దేశద్రోహము. మా భాష కావాలంటే రాజద్రోహం అయింది. అంటూ పలువిధాలా ప్రచారము అవుతుంది.

ఏ. సీ. వాలకము విచిత్రము. ఏ. సీ. అని అనుకొనే వాళ్ళ ప్రతి పిచ్చ ఒక నవీననగిషీ అవుతుంది. ఎవరైన ఒక విధముగా నడుస్తారనుకోండి. ఒరే ఆ కాకును ఏడిపిద్దాం. అంటూ చేతులూకాళ్ళూ విసరుతూ పక్షవాయువు వచ్చిందేమో, అన్నట్టుగా నడిచి తామూ కాకులవుతారు. అలాగాచెప్పా మీరు బీ. సీ. అవుతారు.

పూర్వము గుడ్డలను వేసుకోకుండా అడవులలో ఉంటే ఛా! అనాగరికులు బార్బేరియన్లు అన్నారు. ఇపుడు న్యూడిజమ్ ఒక కల్చర్ - అలాగా జరుగుతూవుంటే మనం భేష్! భేష్! అనాలి, అనుకరించాలి. కాకపోతే బి. సీ. అనుకరణము మనకు ముఖ్యావశ్యముఅంటూ, ఏ. సీ. వాలకము చెబుతుంది.

అంటే మనము యేప్పునుండి వచ్చాం అనేమాటని మనము మరవకూడదు. పొజిషన్ వచ్చినతర్వాత ఒరిజినల్ దశ నివదలితే తలతిరుగుతుంది. అని ఓ. ఏ. సీ. దీనికి యెక్స్ప్లనేషను విత్ రెఫరెన్సు టుకాంటెక్స్టు అంటూ చెబుతాడు. వెనుక మా గ్రాండ్ మదర్ యేమన్నది తెలుసా! నాయనా! ఈ మనిషి నోరుఅనేది తోలుది. ఏ విధముగా అంటే అలాగా సాగుతుంది అని, మానాన్న చెప్పినకథ ఓటి జ్ఞాపకం వస్తూవుంది.

ఇప్పుడాకథ వ్రాస్తే వాడికి ఒక కథ తెలుసు ఎలాగాదాన్ని దూర్చడం అని అవస్థపడి ఆఖరుకు యిరక బెట్టాడు. అంటూ మా మేధకు అపవాదము వస్తుందనేబుద్ధితో, దాన్నికుదించుకొంటున్నాను. అంటే యిది ఏ. సీ. ఏ. సీ. ని అనుసరించిపోకపోతే అన్యాయమౌతాము. పెద్దలు చెప్పేట్టుగా దేశకాల పాత్రానుగుణము చరించాలి. వాళ్ళు బి. సీ- వాళ్ళే అయినా ఏ-సీ- సమాచారాన్ని ఫ్రాసగుచ్చినట్టుగా చెప్తారు-

ఏ-సీ- వాలకము యేలాంటిదిఅంటే నన్నుదిగమన్నాదిగను ఇది ఫ్యాషన్ ఇలాపోకపోతే నీవు బీ-సీ- అని భీష్మించేది జాస్తిగా మాట్లాడితే అగ్గిఫైర్, నేనీమాటగా ఏ-సీ అంటే మా వాడు అదేంటిమామా! ఏ-డీ- అనాలసింది ఏ-సి- అంటావు! నీ బీ-సి- త్వము బాగా యెగ్జిబిట్ అయిందిలే అన్నాడు-

ఇలా వ్రాయడముచేత నేను ఏ. సి. కాదని వాడి అభిప్రాయము. కాని నేనూ బీ. సి. ను యెలా అవుతాను? ఏ, సి. బీ. సి. అవుతానని నేను వాడితో చెప్పాను. ఇదీ సనాతనము, అధునాతనము అంటూ మన వాళ్ళు అచ్చముగా చెప్పేది. ఇలా వ్రాయడానికి నీకేంపాండిత్యము, అంతస్థు, వక్త్రత్వము యేమైనా ఉందా అంటారా!

తెలుసుకోండి. ఇది ఏ. సి. ఇందులో అది మినహా కన్యాదానము అన్నట్లు విజ్ఞానము లేకపోయినా శాస్త్ర విజ్ఞానదానం చేయడమనేది ఏ. సి. వాలకము మఱినాకు ఏ. సి. అర్హత, కలుగాలి అంటే నేనీలా వ్రాయాలి. సంఘముకదండీ సెలవు.

# అభినవ

ఎవరండీ మీకు చెప్పింది ప్రాతవాళ్లని క్రొత్తవాళ్ళు నిరసిస్తూన్నారని? సనాతనులపై అధునాతనులకు గౌరవం తక్కువ అనీ? పురాతనులపైన ఇప్పటివారికి తప్పకుండా ఎంతో గౌరవం ఉంది. ఇది మానిశ్చయం. దీనికి కారణం చెబుతానినండి

మనవాళ్ళలో ముఖ్యంగా ప్రబలుతూఉండేది ఏంటి? కొత్తకొత్తగా పేర్లను కనిపెట్టడం కాదుసుమా. పండితులైనాసరే, మూర్ఖులైననుసరే, కవులైనాసరే మరి ఎవరైనా కూడా ప్రాతపేర్లకన్నింటికీ ఒక నూతన మసాలాను పురమాయించారు. అదేపై 'అభినవ' అనేది. ఎవరైనా కొత్త సంగతిని కనిపెట్టకపోయినా ప్రాతదానికి బురకావేసి చెప్పితే 'అభినవనారద' అంటారు. రాగాలకి క్రొత్తపేర్లనుపెడుతూ పాతదానిలో 'సీగమపా' అనడానికి 'సాగమపా' అనడంచేత అభినవత్యాగయ్య అని డాబుగా పిలువబడుతారు. ఇలాగు ఈ 'అభినవ' అనేది మరీ ప్రసిద్ధికివచ్చిఉంది. సనాతనులపై (ఇక్కడ సనాతనులంటే అందరూ అనుకునేటట్టు మతప్రకారం కాదు. అంటే ప్రాతకాలమువారన్నమాట) గౌరవం లేకపోతే వారివారి నామాలకు ముందు 'అభినవ'...అంటూ బిగుత్తుగా ధరించుకోవడం ఎందుకూ?

'అభినవ' ఇపుడు చాలా ప్రచారంలోఉంది. ఒకాయన సత్తాను ప్రకటించడంలోకూడా 'అభినవ' మార్గం అవలంభించ పడుతోంది. ఇంతకుముందు ఒకరి పాండితీవిశేషంగాని వారి కవిత్వపు పటిమగాని పక్త్వ్రత్వ అర్హతలుకాని కృషిచే వాటిని ప్రకటించుటచే అందరికీ తెలుస్తూఉండేది. ప్రస్తుతం ఇది అభినవ మార్గం ధరించింది. డప్పువాయించడంలో నాటకాల సినిమాల కాకితాలలో బీడీప్రదర్శనాల్లో అభినవమార్గాలు బయటికి వచ్చినట్లు. ఆఫలానా మనిషిని కూచోబెట్టి ప్రక్కన్నే ఓ పది మంది ప్రేక్షకులతట్టుతిరిగి విసుగు విరామంలేకుండా ఒకరివెంబడే ఒకరు. ఉపన్యాసకులను నేనెఱుగుదును. ఆయన బహుదొడ్డ వారు..., అని కంపరామాయణం చెబుతూ రెండవవారినుంచి ఇంతకుముందటి మనిషి అన్నీ చెప్పినారు నేను చెప్పవలసింది అవసరంలేదు. అయినా ఈయనచాలాగొప్పవారు..., అంటూ సోదెవిప్పడం సంభవిస్తూఉంది- ఒకాయన అన్నాడట- వీలైనంత వఱకు ఏదోఒక ఇంద్రియాన్నైనా తృప్తిపరచుకోవాలి, అని (Satisfy at least one sense if posible) అలాఉంది- స్వేద బ్బాను దబాయించడానికి వీలులేని పెద్దమనుష్యులకందరికీ సంకోచపడే మహాత్ములకందరికీ, ఈ అభినవం నచ్చగలదు- ఇలాగే ఇంకాఈఅభినవాలు ఎన్నోఎన్నోఉన్నాయి-ఏదోరెంటినిమాత్రమే చెప్పబూనుకొన్నా- అభినవకు ముఖ్యంగా ప్రదేశం బిరుదుల్లోనే కాకుండా ప్రకటనల్లో పత్రికా నిర్వహణంలో ప్రతిదాంట్లోనూ

ఉంది. అంటే ఇది సర్వతోముఖం అన్నమాట. నూతనంగా ఏమీ వ్రాయలేకపోతే పాతదాన్ని ఎవరో వ్రాసిందాని మెఱుగులు పెట్టి (అట్లని అనుకొని) పత్రికకుపంపి అందువల్లవచ్చే కీర్తి నీడలో హాయిచెందడంలోకూడా ఎంతో అభినవ ఉంది. ఇలా ఇలాఅభినవప్రపంచములో అంశాలుపాతవన్నీ అభినవంగాతయారవుతూ ఉంటాయ్. ఆఖరుమాట. ఇలాంటి వ్యాసాలు బయలుదేరడంకూడా అభినవమే.



# నాన్ - బ్రాహ్మణార్థం

ఇదేంటరా నాన్ బ్రాహ్మణార్థం అంటూన్నాడు అసలే దేశంలో వర్ణతత్వం అనే కాలకూటం జోరుగా అధికారం చలాయిస్తుంటే అంటూ, కులతత్వాలని రేపుతున్నాడుకదా అంటూ భ్రమపడకండి.

ఈ నాన్-బ్రాహ్మణార్థం అనేపదానికి నిర్వచనం వేరు- ఇది ఇంతవరకూ ఆ అర్థంలో చలామణీ కాలేదు. అందువల్ల మీరనుకొనే అర్థంకాదు-

ఇంతవరకూ అములులో ఉండే దాన్నివాడిదానికి వేరే అర్థం ఉంది అంటున్నావేమయ్యోయ్! ఇది లేకపోతే ఏం! అని ప్రశ్నించేరు సుమీ!

ప్రతిదీకూడా ఆచరణలోనికి రావడానికి కృషి, ప్రయత్నం అనేవి అవశ్యంకావాలి అదిలేకపోతే ఏదీకూడా జతపడదు అందువల్ల యీ అర్థంప్రకారం ఈపదం వ్యాపించగలందులకుగా ప్రయత్నంచేయడానికి పూనుకొన్నాను- అవతలచూద్దాం దాని ప్రచారం ఎలా ఉంటుందో- మేము ఈ పదాన్ని అనుభవంలో వర్తింపచేయడానికి కారణాలు పెక్కులు. అవన్నీవ్యాసక్రమంలో వస్తామ్-

'అయితే ఇంత ఉపోద్ఘాతం ఎందుకు? పంతులూ!' అంటారేమో.

ఏవస్తువైనా ఎంతమంచిదైనా అమాంతంగా లభిస్తే ఏమీ ఉపయోగంలేదు. రాబోయ్యేదేంటిరా! అంటూ మనస్సు తత్తరించాలి. ఆతత్తరపాటుతో వచ్చే సంఘటనం కలిగితే అపుడు రుచికరంగా ఉంటుంది. అందుకే. తినబోవుచు కూరరుచులు తెలియగనేలా' అంటూ పెద్దలు ఘోషిస్తూ ఉండడం! అందువల్ల క్రమేణ గ్రహించాలి. ఇదే తత్వం కాఫీ త్రాగడంలో చప్పరించి మెల్లమెల్లగా పీల్చడంలో ఇమిడిఉంది.

ఇపుడు ప్రతివ్యాసంపైనా పుస్తకంపైనా విమర్శలు మొదలైనవి వస్తూండడంచేతను మొదటనేగనుక దానికవకాశం లేకుండా చేస్తే బాగుంటుందని అనుకొని ఇంత ఏకరువు పెట్టవలసివచ్చింది. ఇక ప్రస్తుతానికి వస్తా.

నా- బ్రాహ్మణార్థం అంటే బ్రాహ్మణార్థంకానిది అన్నమాట. బ్రాహ్మణార్థం అంటే ఏమిటో ఎఱుగని వాళ్ళుంటారా! ఏమో! చెప్పడానికిలేదు దాని అర్థంవంటో తెలియని వాళ్ళుకూడా ఉండవచ్చును. ఎంచేతనంటే కాలం విపరీతంగా మారుతోంది. ఎన్నో తలక్రిందులయ్యాయి. హిందూ సాంప్రదాయాలు వ్యవహారాలు ఎన్ని అడుగంటిపోవడంలేదు? అందులో ఇదీకూడా ఒకటేకావచ్చు. అంచేత ఈ బ్రాహ్మణార్థం అంటే ఏమిటో చెప్పడం తప్పనిసరిగా ఏర్పడుతోంది.

బ్రాహ్మణార్థం అంటే ఎవరైనా చనిపోతే వాళ్ళ జ్ఞాపకార్థం ఏటేటా శ్రాద్ధంచేస్తూ వాళ్ళ ఆత్మలని తృప్తిపఱచడానికి కొంతమంది బ్రాహ్మలని నిమంత్రితులనుచేసి బాగా ఆరగింపులు చేయించడం అనేదే. ఈబ్రాహ్మలు భోంచేయడంవల్ల పితృదేవతలందరూ తృప్తి చెందుతారనే అభిప్రాయం దీన్నికలుగజేసింది.

అయితే బ్రాహ్మలకే ఎందుకుచేయాల అని ప్రశ్నించేరు సుమీ! ఎందువల్లనంటే అది ఆచారం పరిపాటి అయిపోయింది ఈబ్రాహ్మణార్థానికి వ్యతిరేకం నాన్-బ్రాహ్మణార్థం. శ్రాద్ధం కానివాటికల్లా అంటే టీపార్టీలు, పాన్సుపారీలు, అల్పాహారపు విందులు మరి ఇత్యాదులకల్లా - ఆహ్వానింపబడి పొయ్యే మహా మహులందఱూ నాన్-బ్రాహ్మణార్థం చేస్తూన్నారని మానిర్వచనం. కాబట్టి నాన్-బ్రాహ్మణార్థం అందఱికీ నచ్చగలదని మా దృఢనమ్మకం.

ఈమార్గం బ్రాహ్మణార్థం చేస్తే పరువుపోతుందనీ శ్రాద్ధాలు పెద్ద అడ్డంకులనీ తలచే మహాశయులకందఱికీ అనువుగా ఉంటుంది. బ్రాహ్మణార్థం చెయడానికన్నా నాన్-బ్రాహ్మణార్థానికి—అంటే విందులకి మొదలగువాటికి పోవడం నాజూకుగాను కుశాలుగాను ఉంటుంది.

ఇందులోఉండే సూక్ష్మం మా ఏ. సీ. భాయీలకందరికీ (ఏ. సీ. అంటే ఏంటో మా ఏ. సీ. వాలకంలో చూడవచ్చును) నచ్చగలదు. దీనికి ఉండేంత కాస్మాపాలిటన్ అవుట్లుక్ మఱి

దేంట్లోనూ ఉండదూ. అందఱికీ - అన్ని వర్ణాలవారికీ ఆఖఱికి షాశ్చాత్యులతో సహా - దీనికిప్రవేశం ఉంది. అందువల్ల వాళ్ళు కొందుకూ మనకొందుకూ అంటూ కుల వైమనస్యాలను పెంచే డానికిగాని అలాంటి దుర్భావాలకి కాని ప్రవేశం లేనేలేదు—అలా లేదేఅని అఘోరించే జనాభాయొక్క కన్నెఱ్ఱకితప్ప!!

ప్రతీవాళ్ళూ ఈ నాన్ - బ్రాహ్మణార్థం చేయడంవల్ల శ్రేయాన్ని తప్పకుండా పొందుతారు.

ఈ నాన్-బ్రాహ్మణార్థం అనేదానికి మహాత్మ్యని నాన్-వయలెన్సుకు ఉండేంత పవర్ ఉంది. దీనివల్ల తృప్తి చెందని నర మానవుడుండబోడు. ఇంకా దీంట్లో ఎన్నో సుగుణాలున్నాయ్.

బ్రాహ్మణార్థంవల్ల ఏ కొందఱు బ్రాహ్మలో తృప్తిపడ గా అందువల్ల పితృదేవతలు శాంతిస్తారట! అయితే మా 'నాన్ బ్రాహ్మణార్థం'వల్ల పితృదేవతలేంటి భూదేవత లందఱూనూ తా తృప్తి చెందుతున్నారు. భూదేవతలంటే బ్రాహ్మలు మాత్రమే కాదుసుడీ! భూలోకంలో మనకు కావలసినవి ఇవ్వగల, ఇచ్చే గొప్పవాళ్ళకల్లా వర్ణవ్యవస్థలేకుండా అందఱికీ ఈపదం అన్వయి స్తుంది. మఱి ఆత్మతృప్తికీ భూతతృప్తికీ ఇది అమోఘమైనమందు త్వరలో పనిచేస్తుంది. కర్మకాండ ఇవీఅవీ లేకుండా మనస్సులో నిశ్చలంగా ప్రార్థిస్తే 'కోటిపుణ్యాంలభేత్' అంటూ చెప్పడం చేతను ఇది అలా అనుకొనే మహాత్ములకందఱకూ ఆత్మతృప్తికి

సరిపోతుంది. 'లోగుట్టు పెరుమాళ్ళకెరుక' అయినా మేంమన స్సులో స్మరించుకొన్నాం అని పైకి చెప్తూఉండే మహాను భావు లు గుంపులోగోవింద అన్నట్టు ఆ ఫలానాతిథి దినంలో ఎవరో తనకు ఆవశ్యం సహాయంచేసే ఆయనకు నాన్-బ్రాహ్మణార్థం చేసి ఏకమూలికా ప్రయోగంతో పనిని ముగించి తుష్టులు కాగ లరు. ఈ విధంగా అన్నింటికీ వజ్రాయుధంగా మానాన్-బ్రా హ్మణార్థం పనిచేయగలదు.

ఒక పుస్తకంపైన సద్విమర్శ రావలెనన్నా ఏదైనా ఉద్యోగంలో ప్రమోషన్ రావలెనన్నా సౌభాగ్యంకలుగవలె నన్నా ఓ నాన్-బ్రాహ్మణార్థంతో సరిపోతుంది. అందువల్ల ఇది గనుక ప్రచారంలోకివస్తే ఎంతో మేలుకలుగుతుంది. అంద ఱికీ తరణోపాయం ఇది మాత్రమే కాబట్టి మా ఉద్యమంతో సానుభూతి చూపించి మా కృషిని సఫలీకృతంగా చేయగలందు లకు ప్రార్థించుచున్నాము.

అంతాచదిని 'ఇదేమిటోయ్ పెద్దమనిషీ! నాన్-బ్రాహ్మ ణార్థం అంటే ఏమో అనుకొన్నామే! ఇంతేనా! ఇదిఇంతకుముందే అములులోఉందే!' అనిమమ్మలను దెప్పేరుసుమీ! ఒకవేళవిందు లు టీపార్టీలు అల్పాహారాలు మొదలయిన నాన్-బ్రాహ్మణార్థ పు కుదురులు ఇదివఱకే మేముచెప్పిన ఉద్దేశాలను పరిపూర్తి చేస్తూఉన్నా అవి విరివిగా ప్రచారంలోనికి రావడానికి అలాంటి అనామధేయపు జీవ ందానికి ఏమాత్రం సహాయకారి కాజాలదు

దీనికి ఓ ఉదాహరణం చూడండి. 'మేకు' అంటే నల్గర్ అని తూష్ణీభావంతో చూచినా కట్టును తగిలించి ఆమేకునే కోట్ హాంగర్, అని గనక అంటే శహభాష్ అంటూ సంకోచాలని విసర్జించి ఉపయోగించగలరు- అందువల్ల ఇలాంటి అటాక్టివ్ బురఖా ఒకటి తగిలించవలసి ఉంటుంది. అలాగా చేయకపోతే విస్తారంగా అనుభవంలోకి ఇవన్నీ రావడం కష్టం- ప్రోపగాండా చేయకపోతే నవీన ప్రపంచంలో ఏదీసాగడం దుష్కరం ఆఖరుకు దేవళాలలో ఉండే దేవుళ్ళకైనా కూడా ప్రకటనలు మొదలయినవి అవసరం అవు. తూన్నాయ్ కాబట్టి నాగ-బ్రాహ్మణార్థం ప్రచారంలోకి రావడానికి ఈ నూతన నామధేయాన్ని లంకించి ఆ ప్రమేయాన్ని కలిగించినవాడనైనా అవుతానేమో! దీనికి మీరు ఒప్పుకోరూ!

## —: భ ర త వా క్యం :—

ఇలావ్రాశానని 'నీపుస్తకంపైన సద్విమర్శ రావాలంటే మాకూ నాగ—బ్రాహ్మణార్థం చెయ్యాలన్యాయ్ లేకపోతే పుటంవేస్తాం' అంటూ మమ్మల్ని విమర్శకులు కాస్తా బెదరించకుందురుగాక!!



